పంచవర్ష ప్రణాళిక గడువు లోగా ఆంధ్రలో రెట్టింపు విద్యుచ్ఛక్తి ఉత్పత్తి —5 వ పేజీ

# ఆంధ్రపత్రిక

భారత దేశంలోని తమస్థావరాలను ఖాళీ చేసి వెళ్లిపోవడానికి ఫ్రాన్సు సన్నాహాలు —3 వ పేజీ

318873

THE ANDHRA PATRIKA - MADRAS. సంపుటం 41. సంచిక 125 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO శుక్రవారం 6-8-1954 Reg. No. M. 1118 6 పేజీలు వెల 1 అణా.


# డయ్యూ, డామన్లు పోయినా, గోవ రక్షణకు పోర్చుగీస్ ప్రయాస

## విదేశీ నిపుణుల సహాయంతో మూడు పెద్దవిమానాశ్రయాలు నిర్మిస్తున్న సూచన

### మొదటి రెండు స్థావరాలు దక్కడం అసాధ్యమేనని నిర్ణయం: పెద్దపెట్టున సైనిక సమీకరణ

బెల్గాం, ఆగస్టు 5: విదేశీ నిపుణుల సహాయంతో గోవాలో మూడు విమానాశ్రయాలు నిర్మించబడుతున్నవని గోవాలోని విశ్వసనీయవర్గాలద్వారా తెలుస్తున్నది. వీటిలో కల్లా పెద్ద విమానాశ్రయం 'వాస్కో' ఏమిపాం నిర్మించబడుతున్నదట.

గతవారంవరకూ గోవాలో భారత ప్రతినిధిగా వుండివచ్చిన విన్సెంట్ కోయెలో నిన్న ఢిల్లీ వచ్చిన సందర్భంలో విలేఖరులతో మాట్లాడుతూ పోర్చుగీసువారు మూడుకోట్లరూపాయల వ్యయంతో గోవాలో ఒక విమానాశ్రయం నిర్మిస్తున్నారని వెల్లడిచేశారు. పోర్చుగీసువారు డయ్యూ, డామన్‌లపై ఆశవదులుకున్నారనీ, అవిపోయినా గోవా నైనా దక్కించుకోవాలనే పట్టుదలతో, గోవాలో సాగిస్తున్న రక్షణ ఏర్పాట్లలో యీ విమానాశ్రయాల నిర్మాణం ఒకభాగమేననీ కూడా తెలుస్తున్నది.

ఇందుకు నిదర్శనంగా, గోవాలోని క్రైస్తవ యువకులను, విద్యార్థులను, అనాధాశ్రమాలకు చెందినవారినీ కూడా పోర్చుగీసు ప్రభుత్వం సైనికులుగా చేర్చుకుంటున్నదనీ 18 సంవత్సరాలకు పైగా 60 ఏళ్ళకు లోబుగానూ వయస్సుగల పురుషుల నందరినీ నిర్బంధంగా సైనికదళంలో చేర్చడానికి కూడా ఆయత్తపడుతున్నదనీ వార్తలు వస్తున్నవి.

గోవా సరిహద్దులలో సంఘర్షణ గాని ప్రారంభమైతే, యీ కొత్తగా చేర్చుకున్న సైనికులను ముందుకు నెట్టి, వారి వెనుక పోర్చుగీసు సైనికులనూ నీగ్రో పటాలాలనూ నిలుపడానికి ఆలోచన జరుగుతున్నదని విశ్వసనీయమైన గోవా వర్గాల ద్వారా తెలియవచ్చింది.

హిందువులయిన ప్రతి వ్యక్తినీ గోవా అధికార్లు చాలా అనుమానంతో చూస్తున్నారట. క్రైస్తవులకు హిందువులపై విద్వేషం కలిగించే నిమిత్తం, హిందువులు దురాక్రమణ చేసి, క్రైస్తవుల నందరినీ బలవంతాన హిందూమతంలో చేర్చుతారని క్రైస్తవ మతాచార్యుల ద్వారా ప్రచారం సాగిస్తున్నారట.

గోవాలో బియ్యం, చక్కెర ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. ఇందుకు కారణం గోవా అధికారులు యీ రెండిటినీ, దొరికినంత వరకూ హెచ్చుధరలు పెట్టికొని, నిలవ చేస్తుండడమేనని చెప్పుకుంటున్నది.

### బ్రజిల్ మద్దతు

వాషింగ్‌టన్, ఆగస్టు 5: ఐదు శతాబ్దాలనుంచి 'న్యాయబద్ధంగా' పోర్చుగల్ క్రిందవున్న ఇండియాభూభాగాలు ఇప్పుడు పట్టుడయ్యంగా, కబళించబడటాన్ని బ్రజిల్ అంగీకరించదట.

బ్రజిల్ ప్రభుత్వం పోర్చుగీసు ఇండియాలోని సంఘటనల గురించి నిన్న ఒక ప్రకటన చేస్తూ, యీ అంశాన్ని వెల్లడించింది.

యీ సంఘటనలు అంతర్జాతీయ వాదాలను శాంతియుతంగా పరిష్కరించుకోవాలన్న సూత్రానికి విరుద్ధంగా వున్నవని బ్రజిల్ విమర్శించింది.

యీ సమస్య విషయంలో బ్రజిల్ పోర్చుగల్ ను సమర్థిస్తున్నట్లు స్పష్టపరుస్తున్న యీ ప్రకటన ప్రతిని బ్రజిల్ ప్రతినిధి అమెరికా విదేశాంగ కార్యాలయానికి అందచేశారు.

### అనంతపురం ఇంజనీరింగ్ కాలెజి

#### 18 లక్షలతో భవనం: శ్రీ సంజీవరెడ్డి హామీ

అనంతపురం, ఆగస్టు 4: అనంతపురం ఇంజనీరింగ్ కాలేజి శాశ్వత భవన నిర్మాణానికి 18 లక్షల రూపాయల ప్లానులూ అంచెనాలూ తయారయాయి. ఈ భవన నిర్మాణం అవసరాన్ని మంత్రివర్గం గుర్తించి, మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తి అయ్యేలోగా నిర్మాణం పూర్తికావడానికి వీలుగా అందుకు కావలసిన డబ్బును మంజూరు చేస్తుందను కొంటున్నామని ఉపముఖ్యమంత్రి పీఠం సంజీవరెడ్డిగారు నిన్న ఇక్కడ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ అన్నారు. (స్వ. వి.)

## గోవాలో పోర్చుగీస్ నిరంకుశ చర్యలు

### సైనిక, పోలీసు బలాల అభివృద్ధి: భారత ప్రతినిధి విన్సెంట్‌కోయిలో వివరణ

న్యూఢిల్లీ, ఆగస్టు 4: పోర్చుగీసు అధికారులు ప్రజలను చెదరగొట్టడానికి ఎంత నిరంకుశంగా ప్రవర్తిస్తున్నా గోవా ప్రజలలో నూటికి 90 మంది గోవాను పోర్చుగీసు బంధాలనుండి విడిపించి, ఇండియాతో కలపడం తప్పకుండా సాధ్యమేనని పూర్తిగా విశ్వసిస్తున్నారనీ, హిందువులూ, క్రైస్తవులూ కూడా చేతులు కలిపి ప్రగాఢమైన వాంఛతో గోవా విమోచనోద్యమంలో పాల్గొంటున్నారనీ గోవాలో భారతప్రతినిధిగా ఉండివచ్చిన విన్సెంట్ కోయిలో నేడిక్కడ పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ఉద్ఘాటించారు.

గతవారంలోనే, యీయనను గోవా నుంచి వెళ్ళిపోవలసిందని పోర్చుగల్ కోరినమీదట, ఢిల్లీకివచ్చారు.

1946 లో డాక్టర్ లోహియా ప్రారంభించిన గోవా విముక్తి ఉద్యమువార్షికోత్సవం ఇటీవల జరగడంతో, గోవా పరిస్థితులు తీవ్రరూపం దాల్చినవనీ, అప్పటినుంచే పోర్చుగీసులు దారుణమైన నిరంకుశచర్యలు ప్రారంభించారనీ కోయిలో చెప్పారు.

నాటినుండీ, తను మొన్న గోవా వదిలివచ్చే వరకూ 70 మందిని అరెస్టు చేశారనీ, ఎందరినోకొట్టి నానా హింసలూ పెట్టారనీ, ఉద్యమంలో ప్రజలు పాల్గొనకుండా చేయడానికి గోవా రేడియో ద్వారా అనేకరకాలుగా బెదరింపులు చేశారనీ ఆయన చెప్పారు.

భారతదేశంనుంచి గోవాకు వచ్చే 〈అస్పష్టం〉 వార్తాపత్రికలను నిషేధించారనీ, ఎవ్వరూ నోరెత్తి మాట్లాడకుండా సభలూ సమావేశాలూ జరపకుండా చేశారనీ ఇటువంటి 〈అస్పష్టం〉 కర్ఫ్యూ పద్ధతులు అమలుజరుపుతూ వచ్చారనీ కోయిలో వివరించారు.

ఇది ఇలా ఉండగా పోలీసు బలాలూ పటాలాలూ కూడా హెచ్చించారు. ఇదివరలో 15 వందల మంది పాయుధసైనికులూ, 450 మంది పోలీసులూ ఉన్న చలవలో ఇప్పుడు 5 వేలమంది సైనికులూ, వెయ్యిమంది పోలీసులూ ఉన్నారని కోయిలో వెల్లడించారు.

〈అస్పష్టం〉 పాయుధసైనికులనూ ఉంచారు.

మూడుకోట్లరూపాయల వ్యయంతో గోవాలో ఒక విమానాశ్రయం నిర్మించబడుతున్నదని కోయిలో ఒక ప్రశ్నకు సమాధానంగా వెల్లడించారు.

గోవా అధికారుల 〈అస్పష్టం〉 ప్రజలు, ముందుముందు ఏం జరుగుతుందో తెలుసుకోలేక సతమతమవుతున్నారు.

డామన్ జనాభా ఆరువేలకీ ఇప్పటికి 15 వందలమంది భారత ప్రాంతాలకు తరలిపోయారనీ, యీ విధంగా అన్నిచోట్లనించీ ప్రజలు తండోపతండాలుగా వలసపోతున్నారనీ ఆయన తెలియపరచారు.

గోవా ఆర్థికవ్యవస్థ గురించి వివరిస్తూ ఇందులో మూడింట రెండుపాళ్లు దొంగరవాణాకు సంబంధించినదని చెప్పారు. ఇక్కడ విదేశీయుల పెట్టుబడితో జరిగే వ్యాపారాలు లేవు. గనులలో చాలాభాగం భారతీయుల పెట్టుబడే.

పరిపాలనా విధానంగురించి ప్రస్తావిస్తూ గోవా ప్రధానపరిపాలకుడు గవర్నరు జనరల్ అనీ, పరిపాలనావిధానాలలో ఇతనికి ఒక సలహాసంఘం ఉంటుందనీ చెప్పారు. గవర్నరు జనరల్ శాసనాలు చేస్తారు.

పోతే, లిస్బన్‌లో ఉండే విదేశ వలసల మంత్రికి పరిపూర్ణ అధిపత్యం ఉంటుంది. ఆ మంత్రికి శాసనాలు ప్రవేశపెట్టడానికీ రద్దుపరచడానికీ కూడా అధికార్లుంటాయి.

### నాగర్ హవేలీలో 50 గ్రామాల విముక్తి

బొంబాయి, ఆగస్టు 4: నాగర్ హవేలీ లంకలో, గోవా ప్రజాపార్టీ, ఆజాద్ గోమంతకదళ వాలంటీర్లు ఇప్పటికి విముక్తిచేసిన గ్రామాల సంఖ్య 50 అనీ, వీటి జనాభా 60 వేలు అనీ పార్టీ దళ నాయకులు 〈అస్పష్టం〉 దంపతులు నేడు వెల్లడించారు.

## కల్లాలపై బ్యాంకుతీర్పుకు బేషరతుగా ఒప్పుకోవాలి

### 'అవార్డ్' పూర్తిపాఠాన్ని ప్రకటించాలని ప్రపంచబ్యాంకుకు భారతప్రభుత్వ స్పష్టీకరణ

("ఆంధ్రపత్రిక" విలేఖరి)

న్యూఢిల్లీ, ఆగస్టు 4: షరతులు ఏమీ పెట్టకుండా పాకిస్థాన్ ప్రపంచ బ్యాంకువారి పంజాబు కాల్వల తీర్పును అంగీకరిస్తేనే తప్ప, తాను ముందు ముందు యీ విషయమై ప్రారంభమయ్యే సమాలోచనలలో పాల్గొనననీ భారత ప్రభుత్వం, ప్రపంచ బ్యాంకుకు స్పష్టంగా తెలియజెప్పినట్లు తెలుస్తున్నది.

అంతేగాక ఇండియా ప్రపంచ బ్యాంకును ఈ తగాదానుగూర్చి తాను యిచ్చి వున్న "అవార్డు"ను పూర్తిగా ప్రకటించవలసిందనిగూడా కోరింది. ఆ అవార్డు పూర్తిపాఠం ప్రకటన కాకపోవడం ఆధారంగా తీసుకొని పాకిస్థాన్ అందులో లేని విషయాలను గూడా వున్నట్లు ప్రచారం చేస్తున్నది. ఆ ప్రచారాన్ని నిరోధించడం ఆ అవార్డును పూర్తిగా ప్రకటించడంవల్లనే సాధ్యమవుతుందని ఇండియా భావిస్తున్నది.

ఉదాహరణకు ప్రపంచ బ్యాంకు అవార్డులో యెక్కడా పాకిస్థాన్‌లో "డాం"ను కట్టడాన్ని గూర్చిన ప్రసక్తి లేదు. కాని పాకిస్థాన్‌మాత్రం యీ అవార్డును అంగీకరిస్తే, కట్టవలసి వచ్చే 'డాం' లను కట్టడానికి పాకిస్థాన్‌లో ఎక్కడా తగినస్థలం లేదని గుసగుసా ప్రచారం ప్రారంభించింది. అదీకాక ఈ తగాదానుగురించి ప్రపంచబ్యాంకు మధ్యవర్తిత్వం నెరపిన సందర్భంలో తన తరఫున వాదించడానికి పోయివున్న ఇంజనీరువర్గం నాయకుణ్ణి గూడా ఉద్యోగంలోంచి తీసివేసింది. ఈ ఉదంతం గూడా పాకిస్థాన్ ప్రచారంలోవున్న బలహీనతను చూపిస్తున్నది.

పోతే ఈ అవార్డును గురించి తాను ఈ ప్రపంచ బ్యాంకువారికి పంపించిన ప్రత్యుత్తరంలో పాక్ ప్రభుత్వం, ఈ అవార్డును ఆధారం తీసుకొని, అది అమలు జరపడానికి వీలుగా వుందో, లేదో, చర్చించడానికి సిద్ధంగా వున్నట్లు మాత్రం తెలియజెసినట్లు తెలుస్తున్నది. ఇంతమాత్రం చెబితే, దాన్ని అంగీకరించినట్లు కావడంలేదు. ఇక ఇండియా ఈ విషయంగూర్చి చర్చల్లో పాల్గొనాలంటే, పాకిస్థాన్ ఖచ్చితంగా ఆ అవార్డును అంగీకరించాలి అని ఇచ్చటివారు అంటున్నారు.

కొలంబో, ఆగస్టు 5: కొలంబో పథకరాజ్యాల ప్రధానులందరితోనూ కలిసి ఇండోచైనాలో శాంతిస్థాపనకు సింహళ ప్రధాని చేసిన దోహదానికి కృతజ్ఞత తెలుపుతూ చైనా ప్రధాని చౌ ఎన్ లై దగ్గరనుంచి నేడొక సందేశం అందింది.

## సమితిలో చైనా సభ్యత్వ సమస్య

### అమెరికా వైఖరిపై ఐసెన్ హోవర్ ప్రకటన

వాషింగ్టన్, ఆగస్టు 4: సమితిలో కమ్యూనిస్టు చైనాను ప్రవేశపెట్టేందుకు జరిగే ప్రయత్నాలన్నిటినీ ప్రతిఘటించవలసిందని అమెరికన్ వ్యాపార, పుర ప్రముఖుల సమావేశం చేసిన తీర్మానం చాలా వాస్తవికంగా ఉన్నదని ప్రెసిడెంట్ ఐసెన్ హోవర్ నేడు వార్తాసభలో వెల్లడించారు.

జూలై 23 న హైనాన్ దగ్గర బ్రిటిష విమానాన్ని కూల్చివేసిన సంఘటన పై ప్రశ్నించే హక్కు అమెరికాకు లేదని కమ్యూనిస్టు చైనా చేసిన హెచ్చరికను అమెరికా నేడు నిరాకరించింది. అందులో తన పౌరులు ముగ్గురు మరణించటం జరిగింది కనుక, తనకా హక్కు ఉన్నదన్నది.

చనిపోయిన వారికి పరిహారం ఇవ్వాలంటూ అమెరికా పంపిన సందేశాన్ని నేడు పెకింగ్ ప్రభుత్వానికి బ్రిటిష్ ప్రతినిధి అందజేశారు.

## ప్రభుత్వోద్యోగులకు ఉచిత వైద్యచికిత్స

### హైదరాబాదు ప్రభుత్వ ఏర్పాటు

హైదరాబాదు, ఆగస్టు 3: హైదరాబాదు ప్రభుత్వోద్యోగులకు ఇక ముందు ప్రభుత్వ ఆస్పత్రులలో ఉచితంగా చికిత్స లభిస్తుంది.

ప్రభుత్వోద్యోగులు ఆస్పత్రులలోనే వుండి చికిత్సపొందుతున్నా లేక మందులీసుకువెళ్లుతున్నా వారి వద్ద ఏవిధంగానూ రుసుమువసూలు చేయకూడదని ఆస్పత్రుల అధికార్లకు ప్రభుత్వం తాఖీదులు పంపినట్లు తెలుస్తున్నది.

ఈ సదుపాయాలు ఏలాటి ఉద్యోగులకు లభింపజేయాల్సిందీ ప్రభుత్వ నిర్ణయం త్వరలోనే ప్రకటించబడుతుంది. కేంద్రప్రభుత్వోద్యోగులకు యీ సదుపాయం యిదివరకే లభిస్తూవున్నది.

### మద్రాస్ ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తుల సంఖ్య

మదరాసు, ఆగస్టు 4: ఆంధ్ర హైకోర్టుకు మొత్తం 10 మంది మదరాసు హైకోర్టుకు యిదివరకులాగే 16 గాకుండా 12 మంది న్యాయమూర్తుల నికర సంఖ్యను నిర్ణయిస్తూ భారత అధ్యక్షుడు చేసిన ఉత్తరవు పోరుసెంటుజార్జి గెజిటులో ప్రకటింపబడి యున్నది యీ ఉత్తరవు జూలై 6 నుండి అమలులోకి వచ్చింది.

## ఫార్మోజా, దక్షిణకొరియా, జపాన్ రక్షణ సంధి

### అమెరికా ప్రతిపాదనకు టోకియో నిరాకరణ: అవాంఛనీయమైనదని విమర్శ

టోక్యో, ఆగస్టు 4: జపాన్, ఫార్మోజా, దక్షిణ కొరియాలు మూడింటినీ ఒక రక్షణ ఒప్పందంతో ముడిపెట్టటానికి అమెరికా ప్రతిపాదించిన పథకాన్ని జపాన్ నేడు నిరాకరించింది.

ఆ పథకాన్ని గురించి అమెరికన్ విదేశాంగమంత్రి డలెస్ కిందటి మంగళవారంనాడు చేసిన ప్రకటన మీద జపాన్ అధికారవర్గ మొకటి నేడిక్కడ వ్యాఖ్యానిస్తూ అది ఆదరణీయోగ్యం కాదనీ వాంఛనీయం కూడా కాదనీ విమర్శించింది.

"అటువంటి ఒప్పందం సాధ్యపడాలంటే జపాన్, కొరియాలమధ్య స్నేహ సంబంధాలు ఉండాలి. ఇప్పుడవిలేవు ఒక వేళ అవి ఏర్పడ్డా, ఈ రెండు దేశాలూ కూడా అన్యోన్యరక్షణ చేసుకోగల స్థితిలోలేవు. అందువల్ల ప్రస్తుతం ఉన్నట్లే యీ మూడు దేశాలతోనూ అమెరికా రక్షణ ఒప్పందాలు చేసుకుని ఉంటే సరిపోతుంది" అని ఆ అధికారవర్గం వివరించింది.

### ఇరాక్‌లో కొత్త ప్రభుత్వం ఏర్పాటు

#### త్వరలోనే ఎన్నికలు

బాగ్దాద్, ఆగస్టు 4: ఇరాక్‌లో నేడు కాన్‌స్టిట్యూషనల్ యూనియన్ పార్టీ నాయకుడు నూరి అల్ సయద్ కొత్త ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసిన అనంతరం ఇరాక్ రాజు ఇంత వరకు ఆపద్ధర్మ ప్రభుత్వాన్ని నిర్వహిస్తున్న అర్షద్ ఉమారీ రాజీనామాను ఆమోదించడమే గాక, ప్రస్తుతం ఉన్న పార్లమెంటును గూడా రద్దు చేశారు. త్వరలోనే కొత్త ఎన్నికలు జరుగుతాయి.

## చిన్న పరిశ్రమల అభివృద్ధికి మార్గాన్వేషణ

### ముందు నాల్గు ప్రాంతీయ వ్యవస్థల ఏర్పాటు: అజ్మాయిషీకి డైరెక్టర్ నియామకం

(ఆంధ్రపత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, ఆగస్టు 4: దేశంలో చిన్న పరిశ్రమల అభివృద్ధిని పురస్కరించుకొని కేంద్ర ప్రభుత్వం ప్రస్తుతం నాల్గుప్రాంతీయ లఘు పారిశ్రామిక వ్యవస్థలను నెలకొల్పి, అవి బాగా పనిచేస్తే ఆ వ్యవస్థల సంఖ్యను ఎక్కువ చేయడానికి ఆలోచిస్తున్నది. ఈ ఆలోచనతో ఈ పరిశ్రమల పురోగతిని అజ్మాయిషీ చేసేందుకుగాను శ్రీ జంగ్బీర్‌సింగ్‌ను అభివృద్ధి డైరెక్టరుగా నియమించింది.

పైన పేర్కొన్న నాల్గుప్రాంతీయ వ్యవస్థలు ఒకొక్క ప్రాంతీయ డైరక్టరు క్రింద వుంటాయి. వారు యీ డెవలప్‌మెంటు డైరెక్టరు అధీనంలో పనిచేస్తూ వుంటారు. ఈ వ్యవస్థలను భారతప్రభుత్వం కలకత్తాలో ఒకటి ఢిల్లీ దగ్గర ఫరీదాబాద్‌లో ఒకదాన్ని, పూనాలోనో, బొంబాయిలోనో ఒకదాన్ని, మద్రాసుదగ్గర మధురలో ఒకదాన్ని నెలకొల్పుతుంది. కలకత్తాలో వుండే తూర్పుప్రాంతపు వ్యవస్థ అధికారం పశ్చిమబెంగాలు, బీహారు ఒరిస్సా, అస్సాం, మణిపూర్, త్రిపుర రాష్ట్రాలలో వ్యాప్తిపొందుతుంది. ఉత్తరప్రాంతపు వ్యవస్థ (అంటే ఫరీదాబాద్ వ్యవస్థ) అధికారం క్రింద ఉత్తరప్రదేశ్, పంజాబు, రాజస్తాన్, పెప్సూ, జమ్మూ, కాశ్మీర్, హిమాచల్ ప్రదేశ్, బిలాస్‌పూర్, ఢిల్లీ, అజ్మీర్‌లు వుంటాయి.

పశ్చిమాన పూనాలోనో, బొంబాయిలోనో నెలకొల్పబడే వ్యవస్థ అధికారం బొంబాయి, సౌరాష్ట్ర, కచ్, హైదరాబాద్, మధ్యప్రదేశ్, మధ్యభారత్, వింధ్యప్రదేశ్, భోపాల్‌లలో చెల్లుతుంది. మద్రాసు, ఆంధ్ర, మైసూరు, తిరువాన్‌కూర్ కొచ్చిన్, కూర్గు రాష్ట్రాలు మధురలోని దక్షిణ వ్యవస్థక్రింద పనిచేస్తాయి.

ఈ వ్యవస్థలకు ఇంకా డైరెక్టర్లు సెలెక్టు కాలేదు. వారిని సెలెక్టు చేసిన అనంతరంనుంచి ఇవి పనిని ప్రారంభిస్తాయి. ఇవి సరిగ్గా పనిచేస్తే ఇంకా యిట్టి వ్యవస్థలను పెట్టడాన్ని గురించి కేంద్రం ఆలోచిస్తుంది.

ఇవి పనిని ప్రారంభించిన వెంటనే నాల్గు ప్రాంతాల్లోను వున్న వివిధ రాష్ట్రాల్లోను, సలహా సంఘాలను ఏర్పాటు చేస్తారు. ఆ సలహా సంఘాలు ఈ ప్రాంతీయ డైరెక్టరుకు యీ లఘు పరిశ్రమల అభివృద్ధి అవకాశాలను గురించి తగిన పథకాలను నిర్మించడానికి సహాయం చేస్తాయి. సలహాలు ఇస్తాయి.

## యూరప్ రక్షణపై అగ్రరాజ్యాల సభ

### సోవియట్ రష్యా ప్రతిపాదన

లండన్, ఆగస్టు 4: అఖిల యూరప్ రక్షణకై కిందటివారం తాను చేసిన ప్రతిపాదనను చర్చించేందుకు అగ్రరాజ్యాలు నాలుగూ ఈ నెలలోకానీ, వచ్చేనెలలో కానీ సమావేశం కావాలని రష్యా బ్రిటన్, అమెరికా ఫ్రాన్సులను సూచించింది. బ్రిటిష్ స్టేట్ మంత్రి లాయడ్‌కు సోవియట్ రాయబారి మాలిక్ నేడీ సందేశాన్ని అందజేశారు.

రష్యా పంపిన మొదటి సూచనకే పశ్చిమరాజ్యాలు ఇంకా జవాబివ్వలేదు. అయితే ఆయా దేశాల అధికారవర్గాల ప్రకటనలను బట్టి చూస్తే, ఫ్రాన్సు ఒక్కటే ఆ అంశాన్ని పరిశీలించటానికి సుముఖంగా ఉన్నట్లు తెలుస్తున్నది.

### ఆగ్నేయాసియా రక్షణ వ్యవస్థ

#### బర్మా వ్యతిరేకత

కొలంబో, ఆగస్టు 5: పశ్చిమ రాజ్యాలు ప్రతిపాదించే ఆగ్నేయ ఆసియా రక్షణవ్యవస్థలో చేరడానికీ, ఈవిషయం చర్చించడానికి వాళ్లు సెప్టెంబరులో ఏర్పాటుచేసే సమావేశంలో పాల్గొనడానికీ కూడా బర్మా నిరాకరించింది.

బర్మా ప్రధానినూ సింహళ ప్రధానికి నిన్న ఒక కేబుల్ పంపుతూ ఈ విషయం తెలియచేశారు.

### అప్పుల వసూలు వాయిదా

#### ప్రభుత్వ నిర్ణయం: రెవిన్యూమంత్రి ప్రకటన

అనంతపురం, ఆగస్టు 4: రైతులకు ప్రభుత్వం ఇచ్చిన వివిధరకాల అప్పుల వసూలు వచ్చే జనవరినెల వరకూ వాయిదా వెయ్యాలని ప్రభుత్వం తీర్మానించినట్లు నిన్న జరిగిన ధర్మవరం తాలూకా రాజకీయమహాసభ సందర్భంలో రెవిన్యూమంత్రి కోటిరెడ్డిగారు చెప్పారు. ఆ గడువు తరువాత అప్పుల వసూలును ప్రభుత్వం మళ్లీ వాయిదావెయ్యదు. కనుక అప్పటికి వాయిదా సొమ్ము చెల్లించడానికి రైతులుసిద్ధపడాలని రెవిన్యూ మంత్రి అన్నారు. (స్వ. వి.)

## ఆరు జిల్లాలకు ఉపయోగపడే 16 విద్యుచ్ఛక్తి విస్తరణస్కీములు

〈అస్పష్టం〉, ఆగస్టు 4. 〈అస్పష్టం〉 జిల్లాలో ఒక 〈అస్పష్టం〉 ప్రత్యేక్షప్రవర్తన కేంద్ర స్థాపనను ఆవాళ ఇక్కడ సమావేశమైన రాష్ట్రప్రభుత్వ ఆర్థిక స్థాయీసంఘం మంజూరుచేసింది. ఈ కేంద్రానికి మొత్తం ఒకలక్ష యాభైవేల రూపాయలు ఖర్చు కాగలదని అంచనా వేయబడింది

ఈ సమావేశానికి ఆర్థికమంత్రి తెన్నేటి విశ్వనాథంగారు అధ్యక్షతవహించారు.

నెల్లూరు విశాఖపట్టణం, గుంటూరు, పశ్చిమ గోదావరి, కర్నూలు, కృష్ణాజిల్లాలకు ఉపయోగపడే పదహారు విద్యుచ్ఛక్తి విస్తరణ పథకాలను కూడా యీ సంఘం ఆమోదించింది.

ఇంకా తూర్పు గోదావరి జిల్లాలోని 〈అస్పష్టం〉 పథకాన్ని సవివరంగా దర్యాప్తు చేయడాన్ని కూడా మంజూరుచేసింది. ఈ పథకంవల్ల కొత్తగా 25 వేల ఎకరాలు సాగుక్రిందకు రావడమే కాకుండా, ఇంతవరకూ ఇతర పద్ధతులద్వారా సాగయ్యే 18 వేల ఎకరాలకు కూడా పుష్కలంగా నీటిపారుదల సదుపాయాలు చేకూరుతాయి.

# స్థావరాల ఖాళీకి ఫ్రెంచివారి సన్నాహం

## ఠాణాలలోవున్న ఆయుధాలను, మందుగుండుసామగ్రి ఫ్రాన్సుకుపంపివేసే ఏర్పాట్లు

పుదుచ్చేరి, ఆగస్టు 4.— ఫ్రెంచి వలసలలోని అన్ని పోలీసు ఠాణాలలోనూ ఉన్న ఆయుధాలనూ, మందుగుండు సామగ్రినీ, కేంద్ర పోలీసు డిపోకు అప్పగించవలసిందని ఇక్కడి ఫ్రెంచి అధికారులు ఉత్తరువులు జారీ చేసినట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది.

పోగుచేసిన ఆయుధాలను రెండు మూడు రోజులలో ఫ్రాన్సుకుగాని, ఆఫ్రికాలోని ఫ్రెంచి వలసలకుగాని రవాణా చేయబడగలవని తెలుస్తున్నది.

ఆగస్టు 12వ తేదీనాటికి ఇక్కడి ఫ్రెంచి అధికారుల కుటుంబాలు మూటాముల్లె సర్దుకుని ఫ్రాన్సు ప్రయాణం కావలసిందేనని ఫ్రాన్సు ఆదేశించిందన్న వార్తలను ఇక్కడి ఫ్రెంచి అధికారులు చాలామంది ధ్రువీకరిస్తున్నారు. కొందరు అధికారులు తమ కుటుంబాలతో ఇళ్లు ఖాళీచేసిన సంగతి యీ వారాంతానికి తేలకుండదని వీరు అన్నారు.

### ఇండియాతో విలీనంకోరుతు ప్రదర్శనలు

పుదుచ్చేరి, ఆగస్టు 4: ఫ్రెంచి వలసలను ఇండియాలో విలీనం చేయాలని విద్యార్థులు చేస్తూ సుమారు 8 వందల మంది కలంటీర్లు నేడు కాలుకు దగ్గరలు పుదుచ్చేరిలో ఊరేగారు.

ఫ్రెంచి ఇండియా డెమొక్రాటిక్ పార్టీ ఏర్పాటుచేసింది.

యీ సందర్భంలో చెప్పుకోదగిన గొప్ప విశేషం ఒకటి ఉంది.

భారత పతాకాలు పట్టుకుని, నినాదాలు చేస్తూ ఊరేగిన కలంటీర్లపై పోలీసులు దెబ్బ చేసుకోలేదు. చెదరకొట్టలేదు. నిర్బంధాలు జరుపలేదు.

ఈ ఫ్రెంచి వలసలను రెఫరండం లేకుండా ఇండియాలో విలీనం చేయాలనీ, వీటిపై అధికారాన్ని భారతప్రభుత్వానికి స్వయంగా అప్పగించాలనీ ఫ్రెంచివారిని ఒత్తిడిచేసి ఒప్పించడమే ఊరేగింపుల లక్ష్యమని, డెమొక్రాటిక్ పార్టీ నాయకుడు దూతంబి నేడు వివరించారు.

### బస్సుచేసిన విద్యార్థుల బహిష్కరణ

కారైక్కాల్, ఆగస్టు 4: నిన్న కారైక్కాల్‌లో హర్తాల్ చేసి, పాఠశాలలనూ, కళాశాలలనూ గైరుహాజరైన విద్యార్థులు నేడు తిరిగి తమతరగతులకు పోగా, కారైకాల్ పరిపాలకుడు వారిని బయటకు పోవలసిందని ఆజ్ఞాపించాడు. క్షమార్పణ పత్రాలు అందచేస్తేనే ఆవరణలోనికి రావద్దని చెప్పాడట.

పిమ్మట పోలీసులను పిలిపించి పోలీసు కావలా తీసుకువెళ్లి, రెండు వారాల వరకూ ఆవిద్యార్థులు తరగతులకు హాజరు కాకూడదని ఉత్తరువుచేస వారిని పంపివేశాడట.

# బొంబైలో నూనె శుద్ధికర్మాగారం

## ఉత్పత్తి ప్రారంభం

బొంబాయి, ఆగస్టు 5: స్టాన్‌వాక్ బొంబాయి రిఫైనరీలో ఉత్పత్తి ప్రారంభించబడింది. క్రూడ్ ఆయిల్ నిలువబడిన కొన్ని గంటలలోనే, గాసొలైన్, ఆటోమోటివ్, పారిశ్రామిక డీసిల్ నూనెలు, బంకర్ ఫ్యూయల్ వంటి పెట్రోలియమ్ పదార్థాల ఉత్పత్తి ఇండియాలోని పోలి బహుళ ఉత్పత్తి నూనె శుద్ధి కర్మాగారంలో (మల్టీ-ప్రాడక్ట రిఫైనరీ) ప్రారంభమైంది.

రిఫైనరీలో సరుకు నిలువచేసే ట్యాంకులలోకి, వాటి నాణ్యత పరీక్ష పూర్తి అయినతర్వాత, సంప్రుచేయబడ్డాయి.

కర్మాగారంలో తొలి గాసొలైన్ గాలన్ ఉత్పత్తి అవుతూఉండగా, రిఫైనరీ నిర్మాణానికి పూనుకున్న ఇండియాయూనియన్ కంపెనీ అధికారిత్వా రిఫైనరీని ఇండియా స్టాండర్డ్-వాక్యూమ్ రిఫైనింగ్ కంపెనీకి అప్పగించింది.

ఈ సందర్భంలో కంపెనీ మేనేజింగు డైరెక్టర్ విలియమ్. ఏ. విలియమ్సు రిఫైనరీ అభివృద్ధికి పనిచేసిన భారతీయ పనివారలను ప్రశంసించారు. ప్రజలు ఉత్సాహంతోనూ, ధైర్యంతోనూ కృషిచేస్తే అభివృద్ధి కరతలామలకం కాగలదని ఆయన అన్నారు.

# ఆగ్నేయాసియా రక్షణవ్యవస్థ ప్రతిపాదనపై కొలంబో రాజ్యాల తిరస్కృతి: ఈడెన్‌కు వర్తమానం

కొలంబో, ఆగస్టు 4: ఆగ్నేయాసియా రక్షణ వ్యవస్థలో చేరటానికి కొలంబో రాజ్యాలు ఏమాత్రంమీద ఇష్టపడటం లేదనిసింహళ ప్రధాని కొటేలవల బ్రిటిష్ విదేశాంగమంత్రి ఈడెన్‌కు తెలియ చేశారని యు.పి.ఐ. (ఫ్రాన్స్ ప్రెస్ విలేఖరి తెలియజేస్తున్నాడు.

నిన్న రాత్రి ఈడెన్‌కు పంపిన ఒక కేబుల్‌లో కొటేలవల ఈ అంశాన్ని తెలియజేశారట.

ఈ అంశంమీద తిరిగీ కొలంబో రాజ్యాలను సమావేశపరచటానికి తాను చేస్తున్న కృషినికూడా సింహళప్రధాని తన సందేశంలో వివరించారట. కొలంబో రాజ్యాలు సమావేశమై ఈ విషయమై చర్చించాలని పాకిస్థాన్ అభిప్రాయపడుతున్నదని నేను కరాచీలో ప్రభుత్వవర్గాలు వెల్లడించినట్లు పి.టి.ఐ. విలేఖరి తెలియజేస్తున్నాడు.

ఆగ్నేయాసియా ఒప్పందంపై జరిగే చర్చలలో తాము చేరేదిలేదని ఇండియా, ఇండోనేషియాలు ఇంతకుముందే స్పష్టపరచి ఉన్నవి. బర్మాపట్టీ పట్టనట్లుగా ఉన్నది. సింహళం మాత్రం దీనిలో తాము చర్చించుకోవాలని ప్రతిపాదించటం, పాకిస్థాన్ అనుమానిస్తున్నట్లు తెలియటం జరిగింది.

బ్రిటన్ గతవారం పంపిన సందేశానికి ఇండియా ఇచ్చిన జవాబు అందిందని నేడు లండన్ నుంచి వార్త వచ్చింది. ఇండియా ఒప్పందానికి విముఖతను చూపింది.

కొలంబో రాజ్యాలు ఒప్పందంలో చేరవలసిందిగా బ్రిటన్ కోరటం కానీ, దాని స్థాపనకై జరిగే సంప్రదింపులకు వాటిని ఆహ్వానించటం కానీ జరగలేదు కనుక, వాటిని ఆ రాజ్యాలు నిరాకరించే ప్రస్తావనే రాదని బ్రిటిష్ అధికారి ఒకరు నేడు లండన్‌లో వివరించారు. మిగిలిన కొలంబో దేశాల జవాబుల కోసం బ్రిటన్ ఎదురు చూస్తున్నది.

ఆగ్నేయాసియా ఒప్పందంఎందుకూ అంటే, ఇండోచైనా ఒప్పందాన్ని బలపరచటానికేనని బ్రిటన్ అభిప్రాయపడుతున్నదనీ, అందువల్ల కొలంబో రాజ్యాలు ఆఒప్పందాన్ని సమర్థిస్తూ చేసిన సంయుక్త ప్రకటనకు బ్రిటన్ చాలా సంతృప్తి చెందిందనీ బ్రిటిషు అధికారి ఒకరు నేడు వెల్లడించారు.

అమెరికాలో ఏర్పాట్లను పూర్తి చేయటానికి ముందు, కొలంబో రాజ్యాలు ఆవిషయమై జరిపే సంప్రదింపులు పూర్తికావాలని బ్రిటన్ ఎదురు చూస్తున్నది.

### లండన్‌కు ఇండియా జవాబు

ఆగ్నేయాసియా రక్షణ వ్యవస్థమీద అభిప్రాయాన్ని అడుగుతూ...

### ఆంగ్లో-అమెరికన్ సన్నాహాలు

ఆగ్నేయాసియా వ్యవస్థ స్థాపనకు బ్రిటన్, అమెరికాలు సెప్టెంబర్‌లో జరపబోయే సమావేశం మానిలాలో జరుగుతుందని తెలుస్తున్నది. దానికి అమెరికా బ్రిటన్, ఫ్రాన్స్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, ఫిలిప్పీన్స్, సయాంలు హాజరు కాగలవని తెలుస్తున్నది. అందులో పాల్గొనేందుకు ఫ్రాన్సు సమ్మతిని తెలియజేసిందని వాషింగ్టన్‌లో వెల్లడించింది.

సన్నాహాలు క్షకముగా సాగిపోతున్నవని వాషింగ్టన్‌లో బ్రిటిష్ రాయబారి నేడు ప్రకటించారు. ఇండోనీషియా ఈ సంప్రదింపుల్లో ఇష్టకు పాల్గొనే అవకాశం ఏమీ లేదని వాషింగ్టన్‌లోని ఇండోనీషియా వర్గాలు సూచించారు.

### నెహ్రూ ప్రత్యామ్నాయ పథకం

నెహ్రూ ప్రత్యామ్నాయ పథకం పాకిస్థానుకు సరాసరి ఢిల్లీ నుంచీ, కొలంబో నుంచీకూడా అందిందని నేడు కరాచీ వర్గాలు తెలియజేశారు.

ఆగ్నేయాసియా వ్యవస్థలో పాకిస్థాన్ చేరవచ్చునని కరాచీ రాజకీయ వర్గాలు అభిప్రాయపడుతున్నారు.

### నెహ్రూ విధానమే అనుసరణీయం

నేడు సింహళపార్లమెంటు ఆగ్నేయాసియా ఒప్పందాన్ని గురించి చర్చ జరిపినప్పుడు ప్రతిపక్ష నాయకుడు బండారనాయకేగారు ప్రధాని నెహ్రూ విదేశాంగ విధానాన్ని ప్రశంసిస్తూ అది ఆసియాకు అన్ని విధములా తగినదని ఉద్ఘాటించారు. సింహళం...

# 'అభివృద్ధి ప్రణాళికల నిర్వహణకు స్థానికంగ ధనాన్ని సేకరించాలి'

## —రాష్ట్రాలకు ప్లానింగ్ కమిషన్ సలహా

న్యూఢిల్లీ, ఆగస్టు 4: ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకు స్థానికంగా ధనాన్ని ప్రోగు చేసుకోవలసివున్న అవసరాన్ని గూర్చి ప్లానింగ్ కమిషన్ వారు నేడు అన్ని రాష్ట్రాల ప్రభుత్వాలకు విజ్ఞప్తి చేశారు.

రెండో పంచవర్ష ప్రణాళికను అమలుజరపడానికి కేంద్రంలోను, రాష్ట్రాలలోను సమకూడే ధనాన్ని గూర్చిన వివరాలను సేకరించే ఉద్దేశంతో వీరు అన్ని రాష్ట్రాలకు ఉత్తరాలు వ్రాస్తూ, అందులో ఈ రెండో ప్రణాళిక కొంచెం ఉదాత్తంగావుండి, 25 ఏండ్లలో జాతీయఆదాయాన్ని రెట్టింపు చేసేందుకు వీలైనన్నిమార్గాలను ప్రారంభించేదిగా వుండాలని, అందుకు తగినధనాన్ని స్థానికంగా చూసుకోవలసిన అవసరంకూడా కన్పిస్తున్నదనీ విదేశాలమీద పూర్తిగా ఆధారపడడానికి వీలు లేదని, ఆ విదేశాలుఇచ్చే సహాయం అనుకున్నంత అందకుండానూ, పోనీ పొందకుండానూ వుండినా వుండవచ్చునని విశదంచేశారు.

ఈ ఉత్తరంలో వీరు అడిగిన వివిధ అంశాలను బట్టిచూస్తే, మొదటి ప్రణాళికను అమలు జరుపుతున్నప్పుడు లభ్యమైన ద్రవ్యసంపత్తి ఎంతగావుంది, ఈ ప్రణాళికను అమలు జరిపి సాధించిన అభివృద్ధిఎంతెంత అదిగాక వివరాలను సమీక్ష చేయడానికి కూడా వీలు కల్పించు కుంటున్నట్లు కూడా తోస్తుంది. అంతేగాక,రెండో ప్రణాళికను అమలు జరపడానికి ఎంతగా ద్రవ్యం, ప్రస్తుతంవున్న పన్నులు అన్నీ అట్టేవుంచగా, లభ్యం అవుతుందో పరిశీలించడానికి కూడా ఇవి తోడ్పడతాయి. ఇక వీరు కోరుతున్న ఈ సమాచారం అంతా ఈ మాసంలోపల ప్లానింగ్ కమిషన్‌వారికి చేరాలి.

మొదటి పంచవర్ష ప్రణాళిక అమలు జరగడం పూర్తిఅయ్యేనాటికి, లండనులో మనజమవున్న స్టెర్లింగునిల్వలు కనీసమైన ప్రమాణానికి పడిపోతాయి. అంటే, దేశంలో చలామణీలో వుంచుతున్న కరెన్సీనోట్లకు వెనక ఎంత ద్రవ్యం మద్దత్తుగా వుండాలో, అంత మేరకు వచ్చేస్తాయి. అందువల్ల రెండో ప్రణాళికను అమలుజరిపే సందర్భంలో దేశంలో ప్రత్యేకించి ద్రవ్యం కావాలంటే, దాన్ని సంపాయించుకోవలసి వుంటుంది. పోతే ఈ రెండో ప్రణాళిక కాలంలో విదేశాల సహాయం లభ్యమయ్యే అవకాశంవున్నా, ఆ సహాయం ఎంతగా లభ్యమౌతుందో మాత్రం చెప్పడం కష్టం. కమిషన్ వారు మాత్రం, ఈ సహాయం పూర్వం లభించినంత సులువుగాను, పూర్వం లభించినంత పెద్ది మొత్తాల్లోను లభించడం మాత్రం సాధ్యంకాకపోవచ్చునని యీ ఉత్తరంలో పేర్కొన్నారు.

ప్లానింగ్ కమిషన్‌వారు అదినుంచీ కూడా దేశంలో అభివృద్ధి ప్రణాళికలను అమలుజరపడానికి స్థానికంగా ధనాన్ని పోగు చేసుకోవడమే మంచిదనే అభిప్రాయంతో వున్నారు. ప్రతిఒక్క ప్రణాళికను అమలు జరుపుతూవున్న కొద్దీ, ఈ స్థానికద్రవ్య సముపార్జనశక్తి విస్తృతము కావలసివున్నదని కూడా వీరు భావిస్తున్నారు. అందువల్ల ప్రభుత్వపరంగా నడిచే కార్యక్రమాలను యీ రెండో ప్రణాళికలో చేర్చేటప్పుడు, వాటిని నిర్వహించడానికి అవసరమైన ధనాన్ని సమకూర్చుకోడానికి, పై విషయాన్ని దృష్టిలో వుంచుకొని వ్యవహరించడానికి కూడా వీరు తీర్మానించుకున్నారు.

యీ విషయంలో పన్నుల విచారణసంఘంవారు కూడా ప్రస్తుతం విచారిస్తున్నారు. అయితే, కమిషన్‌వారు మాత్రం యీ విషయాన్ని వారు వీరు ఆలోచిస్తున్నారని పూరుకుంటే సరిపోదని, ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం, తన ఉనికిని బట్టి స్థానికంగా ఈ ప్రణాళికల నిర్వహణకు కావలసివచ్చే డబ్బును సమకూర్చుకోవడం ఎట్లాగో ఆలోచిస్తూ వుండటం అవసరమని ఇందులో విజ్ఞప్తిచేశారు.

ఈదృష్టితో ప్లానింగు కమిషన్‌వారు రాష్ట్రాలలో ఏయేవిధంగా ఈ అధిక అర్థాన్ని సముపార్జించవచ్చో, ఆమార్గాలను కూడా కొన్నింటిని ఈ సందర్భంలో సూచించారు: (1) భూమిపన్ను, నీటితీరువ, అభివృద్ధి పన్ను, ఎక్కువ చెయ్యడం (2) ఆయా జిల్లాలో నడిపిస్తున్న అభివృద్ధి కార్యక్రమాలను పురస్కరించుకొని స్థానికమైన పన్నులను విధించడం, (3) వ్యవసాయ ఆదాయంమీద పన్ను విధించడం, (4) ఇవిగాక లఘుపుస్తు అర్థపద్ధతులను, భారీ ఋణగ్రహణ పద్ధతులను అనుసరించడం (5) వీలును మాముకొని, కొత్తపన్నులు విధించడం.

# ఇండోచైనా యుద్ధ విరమణ చర్చలు

## యుద్ధగ్రస్త రాజ్యాల ప్రతినిధులరాక

న్యూఢిల్లీ, ఆగస్టు 5: ఫ్రాన్సు, వియట్నామ్, లావోస్, కాంబోడియా, వియట్మిన్ల ప్రతినిధులకు స్వాగతం ఇచ్చే నిమిత్తం ఇండోచైనా యుద్ధవిరమణ పర్యవేక్షక సంఘ ప్రత్యేక సమావేశం నేటి ఉదయం జరిగింది.

సభాధ్యక్షుడు కృష్ణమీనన్ వారికి ఆహ్వానం చెప్పారు. అనంతరం ఆయుధ ప్రతినిధి వర్గాల నాయకులు యుద్ధాంతిత సమాధానాలు ఇచ్చినమీదట, వాళ్లు సమావేశంవిడిచివెళ్లిపోయినారు. పర్యవేక్షక సంఘంలో సిబ్బందం శనివారం ఉదయం బయలుదేరుతుందని తెలుస్తున్నది. ఆ బృందానికి జె. ఎస్. ఖోస్లా రాజకీయ సలహాదారుగానూ, అలీరాజ్‌పూర్ రాజా సురేంద్రసింగ్ కార్యదర్శిగానూ టి. ఆర్. వి. చారి, ఫ్రెంచ్ డాన్ లు సలహాదార్లుగాను ఉంటారు.

వాషింగ్టన్, ఆగస్టు 5: దక్షిణ పర్షియా నూనెగనులను తిరిగీ పనిచేయించి, వెనకటివలె నూనెను ఎగుమతి చేసేందుకు పర్షియా ప్రభుత్వం 8 నూనె కంపెనీల సమాఖ్యతో ఒప్పందం చేసుకున్నది. యీ నూనెసమాఖ్య, పర్షియా ప్రభుత్వం నేడొక సంయుక్త ప్రకటనలో యీ సంగతి వెల్లడించినవి.

ఈ ఒప్పందంక్రింద ఆంగ్లో ఇరానియన్ కంపెనీకి 840 లక్షల డాలర్లు పరిహారం ఇవ్వబడుతుంది. దీనిని పర్షియా ప్రభుత్వం, కంపెనీల డైరెక్టర్లు 2 నెలల్లో ఆమోదిస్తారు.

# అనుమతి పత్రాలు వున్న వారికే ప్రవేశార్హత

## పోర్చుగీస్ వలసలవిషయమై ఢిల్లీ ఉత్తర్వు

న్యూఢిల్లీ, ఆగస్టు 4: పోర్చుగీసు వలసలనుంచి భారత ప్రాంతంలోకి ప్రవేశించదానికి ముందుగా అనుమతి పత్రాలు పొందిఉండాలని నిశ్చయించబడినదని భారత ప్రభుత్వం నేడు ప్రకటించింది.

ఈ వలసలనుంచి భారతీయ ప్రాంతానికి భారీఎత్తున సాగుతున్న దొంగరవాణాను అరికట్టడమే యీ చర్య తీసుకొనడంలోని ముఖ్యోద్దేశం అని యీ ప్రకటనలో పేర్కొనబడింది.

ఈ ప్రవేశానుమతి పత్రాల విధానాన్ని ఏ తేదీనుంచి ప్రవేశపెట్టేదీ తరువాత ప్రకటించబడుతుంది.

నేను పత్రికలకు విడుదలచేసిన యీ ప్రకటనలో యీ విధంగా వివరించబడింది.

"1954 ఆగస్టు ఒకటవ తేదీనుండి భారత ప్రాంతంలోనివారు గోవాలో ప్రవేశించడానికి అనుమతి పత్రాలనూ, పోర్చుగీసుప్రతినిధి జారీచేసేవిసాపత్రాలనూ పొందిఉండాలని పోర్చుగీసు ప్రభుత్వం నిశ్చయించింది. పోర్చుగల్ జులై 30న యీ నిర్ణయం చేసింది 31వ తేదీన భారత ప్రభుత్వానికి తెలియపరచింది. ఇందులో పోర్చుగల్ చేసినట్లు చెప్పబడుతున్న ఉద్దరింపు కార్యం ఏమిటి అంటే, ఆగస్టు ఒకటి, రెండు తేదీలలో గోవాలోకి అనుమతి పత్రాలు లేకుండా బయలుదేరివచ్చినవారి విషయంలో ఈ నిబంధనల వర్తింపు. అంత కఠినంగా అమలు జరపకుండా ఉండడమే. "ఒక్క ముక్కలో చెప్పాలంటే, ముందు హెచ్చరిక చేయకుండా అవ్యవధిగా ప్రవేశానుమతి పత్రాల విధానం అమలు జరపడంద్వారా, గోవాలోకి భారతీయుల ప్రవేశాన్ని ఒక్కసారిగా అరికట్టివేసింది. దీనివల్ల ఇటు భారతదేశంలోని ప్రజలూ, అటు గోవాలోనివారుకూడా నానా ఇబ్బందులూ పడవలసి వస్తున్నది. ప్రజల శ్రేయస్సు పట్ల భారితలేకుండా ఇట్టి చర్య తీసుకోవడం పోర్చుగీసువారికి వారంపర్యావస్తున్న పద్ధతులకు, తగినట్టే ఉంది.

ఇప్పుడు, పోర్చుగీసు వలసలలోనివారు భారత ప్రాంతానికి రావడానికి ప్రవేశానుమతి పత్రాలు చూపాలని భారత ప్రభుత్వం నిశ్చయించింది. వలసలనుంచి ఇండియాలోకి భారీఎత్తున సాగించబడుతున్న దొంగ రవాణాను అరికట్టవలసిన ఆవశ్యకత ఏర్పడటమే ఈచర్య తీసుకోవడానికి కారణం.

ఈ ప్రవేశానుమతి పత్రాల విధానాన్ని అమలు జరిపే తేదీ తరువాత ప్రకటించబడుతుంది.

"వలసలలోని జనుల ఆగమనాన్ని పూర్తిగా అరికట్టివేయడం ద్వారా అనాయకే ప్రజలను అగచాట్లపాలు చేయకుండా ఉంచే ఉద్దేశ్యంతోనే, ప్రభుత్వం యీ వ్యవధి ఇస్తున్నది."

### గోవానుంచి రోజుకు 200 మంది భారతీయులకు ఉద్వాసన

బెల్గాం, ఆగస్టు 4. గోవాలో పోర్చుగీసు నిరంకుశ చర్యలు నానాటికీ హెచ్చరిల్లి పోతున్నవని యిక్కడికి ప్రతి రోజూ వార్తలు వస్తున్నవి. గోవాలోని భారతీయులను రోజుకి కనీసం రెండు వందలమంది చొప్పున భారతదేశానికి పంపించేస్తున్నారు. కొంకణ్ రాజకీయ సంఘం...

లోండాస్టేషనువద్ద ప్రతిరైలులోనూ వందలకొద్దీ కాందిశీకులు దిగుతున్నారు. వీళ్ళకి చేతిలో కానీ లేదు. తిండికి ఉపాధి లేదు.

గోవా సరిహద్దులో ఉన్న కాసెంరైల్వే స్టేషనువద్ద పోర్చుగీసు అధికారులు ఒక ప్రత్యేక శిబిరం ఏర్పాటు చేశారట. వలసలో ఉన్న భారతీయులను యిష్టం ఉన్నదిగా ఇక్కడికి తీసుకువచ్చి రైళ్ళలో ఎక్కించి పంపివేస్తున్నారు. ఇలా వచ్చే జనంలో అధిక సంఖ్యాకులు గోవాలోని మాంగనీసు గనులలో పని చేస్తున్న భారతీయ కార్మికులే.

నిరాధారులై గాలిపడగల వలె వచ్చిపడిన వీళ్లకి లోండాలోని ఒక వర్తకుడు, స్వచ్ఛందంగా, యధాశక్తి భోజనం పెట్టి, వాళ్ళ ప్రయాణానికి వసతులు చూపుతున్నాడు.

ఆగస్టు 15న జరుగనున్న సత్యాగ్రహం తలుచుకున్న కొద్దీ పోర్చుగీసులు గంగవెర్రులెత్తిపోవడమే ఈ ధోరణికి కారణమని భావించబడుతున్నది. భారతీయులను బయటకు పంపెయ్యడమే కాకుండా, గోవాలోని భారతీయుల దుకాణాలూ, హోటళ్లూ కూడా అధికారులు మూయించివేస్తున్నారు. తాళాలపై సీళ్లు వేస్తున్నారు.

# బ్రహ్మపుత్ర వరద తగ్గుముఖం

గౌహతీ, ఆగస్టు 4: అస్సాంలో 7 జిల్లాలను ముంచివేసిన బ్రహ్మపుత్ర దాని ఉపనదుల వరదలు క్రమంగా తగ్గుతున్నవి. గౌహతీదగ్గర నది రెండు అడుగులు తీసింది.

బరీగంజికో నది వరదకూడా తగ్గుముఖం పట్టింది. అయితే ఈ నదులు ఏడాది కేడాదికి ఎక్కువగా దేశాన్ని ముంచుతూ ఉండడం ఒక పెద్దసమస్య అయిపోయింది.

గౌహతికి 14 మైళ్లలో ఉన్న పలాసబరీ పట్టణం ఈ ఏడంగా బ్రహ్మపుత్రలో క్రమంగా మునిగిపోతున్నది. యీ నీటి వరదలవల్ల ఒక్క గోల్పారా జిల్లాలోనే వెయ్యి చదరపుమైళ్ల ప్రాంతం మునిగిపోయింది. లక్షమంది బాధితులయినారు. లేక్‌పూర్ జిల్లాలో ఉన్న ఇళ్ళలో 60 వంతులు పూర్తిగా నాశనమయినవి. పశునష్టం అపారం.

# మంగళగిరివద్ద క్షయ చికిత్సా కేంద్రం

## నెలకొల్పే అవకాశం: అధికారుల తనిఖీ

మంగళగిరి, ఆగస్టు 4: ఆంధ్ర ప్రభుత్వ క్షయవ్యాధి నివారణశాఖ ప్రత్యేకాధికారి, గుంటూరుజిల్లా వైద్యశాఖాధికారి మంగళగిరి సమీపప్రదేశాన్ని తనిఖీచేసి క్షయనివారణ చికిత్సాలయం నెలకొల్పడానికి ఈ ప్రదేశం వీలుగావున్నదని ప్రభుత్వానికి సూచించినట్లు తెలిసింది. (స్వ. వి.)

# వ్యవసాయ కార్మిక సహకార సంఘాల మహాసభ

## తూర్పుగోదావరి జిల్లాలో ఏర్పాటు

రాజమండ్రి, ఆగస్టు 4: యీ నెల మొదట జరిగిన యీ పట్టణంలోని విక్రమహాలులో జరిగిన సమావేశంలో తూర్పు గోదావరిజిల్లా వ్యవసాయ కార్మిక సహకార సంఘాల మహాసభ అ.సే. సంఘం ఏర్పాటయింది. ఆనాటి సభకు శ్రీ కొవ్విడి లింగరాజుగారు అధ్యక్షత వహించారు.

ఆహ్వానసంఘ అధ్యక్షుడు శ్రీ బత్తిన సుబ్బారావు తమ స్వాగతోపన్యాసంలో జిల్లాలో వేర్వేరు వ్యవసాయ కార్మిక సహకార సంఘాలు ఏ గ్రామాని కా గ్రామంలో ఏర్పడి అక్కడగల ఏకొద్ది భూమినో ఆ సంఘంద్వారా సభ్యులు వ్యవసాయం చేసుకునేందుకు సంపాదించడం, అదే ప్రభుత్వ కౌలుకు ఒక్కొక్కసారి యితరులపరమై వీరికి ఏమీ లభించకపోవటం జరుగుతూవున్న దిగనుక జిల్లాలోని యీ తరగతి సంఘాల ప్రతినిధుల సమావేశం తామిప్పుడు ఏర్పాటుచేశామనీ, యీ సభలో జిల్లా అంతటికీ ప్రాతినిధ్యం వహించి పని చేసే పటుతరసంఘం యేర్పడాలనీ ఉద్బోధించారు.

జిల్లాలోని వివిధ గ్రామాలనుంచి సుమారు 500 మంది ప్రతినిధులు సభకు వచ్చారు.

శాసనసభ్యులు శ్రీ బొజ్జా అప్పలస్వామి సభను ప్రారంభిస్తూ వివిధరాజకీయ పార్టీలవారు హరిజనులపట్ల ఆదరణను వెల్లడిచేస్తూ వారికి స్థిరమైన ఉపకారం జరిగేటట్లు చేయకుండా, తమ తమ పార్టీల ప్రయోజనం కొరకు హరిజనుల నుపయోగించుకుంటున్నారనీ, హరిజనులు తమలోగల అంతశ్శాఖా విభేదాల విస్మరించి ఐకమత్యంగా కృషిచేస్తే, యీ రాజకీయ పార్టీలవారి వివాదాల సుడిగుండంలో పడకుండా ఒకసంఘంగా అభివృద్ధి చెందేందుకు అవకాశమున్నదన్నారు. బంజరు భూముల పంపిణీ విషయంలో ప్రభుత్వ అనవసర కాలయాపన పద్ధతిని విమర్శించారు.

పార్లమెంటు సభ్యులు శ్రీ కానేటి మోహనరావు, శాసనసభ్యులు శ్రీగంజి నాగేశ్వరరావు, జిల్లా హరిజననాయక ప్రముఖులు శ్రీ యాలిహాదపల్లి గారలు కూడా వ్యవసాయకూలీలు సంఘటితంగా కృషిచేస్తే త్వరలో అభ్యుదయం సాధించగలరని హెచ్చరించారు. శ్రీ కె. రామస్వామి నాయుడుగారు లంకలయా భూములను హరిజనులకు వ్యవసాయానికి యివ్వాలన్నారు.

అధ్యక్షులు శ్రీ కొవ్విడి లింగరాజు తమ ఉపన్యాసములో వ్యవసాయ కార్మిక సహకారసంఘాల నిర్మాణ చరిత్రను అపహోమోద్యమము నాటినుంచీ (1921 నుంచీ) వివరించారు. ఇప్పుడు మనకు స్వతంత్రం వచ్చింది గనుక సమష్టి వ్యవసాయ పద్ధతులను దృష్టిలో వుంచుకొని ఆచరణలోకి త్వరలో తీసుకురావాలని కోరుతూ... సహకార సంఘాలకు గోదావరి లంకల కౌలు ఇచ్చే ప్రభుత్వ పద్ధతి ధర్మయుతంగాదన్నారు. పొగాకు ధర విపరీతంగా పడిపోవటమే దీనికి కారణమన్నారు. ఎకరానికి 25 రూపాయలకంటే ఎక్కువకాకుండా శిస్తుకట్టి కౌలు కివ్వటము ధర్మమైన పద్ధతి అని సూచించారు. వ్యవసాయకూలీ సహకార సంఘాలు ఇంకా యెక్కువ భూమిని ఆర్జించాలనే దురాశతో వ్యవహరించ రాదనీ తామెంత భూమి వ్యవసాయము చేయగలరో అంతే కౌలుకు తీసుకోవాలనీ సలహా యిచ్చారు.

సభవారు వ్యవసాయ కార్మిక సహకార సంఘాలు ఎదుర్కొంటున్న అనేక సమస్యలమీద తీర్మానాలు చేశారు.

జిల్లా వ్యవసాయ కార్మిక సహకార సంఘాల ప్రతినిధుల వ్యవస్థ నొకటి యేర్పాటు చేసుకొని దానికి శ్రీ బొజ్జా అప్పలస్వామిగారిని అధ్యక్షులుగానూ శ్రీ బత్తిన సుబ్బారావుగారిని కార్యదర్శిగానూ మరి కొందరిని సభ్యులుగానూ ఎన్నుకొన్నారు. (స్వ. వి.)

# సమితి చర్యలలో పాల్గొనే రాజ్యాలకు అయే ఆయుధాల ఖర్చు

## అమెరికా భరిస్తుందని కమిటీ సమావేశంలో ప్రతినిధి వాడ్స్‌వర్త్ ప్రకటన

న్యూయార్క్, ఆగస్టు 4: ఐక్యరాజ్యసమితి ఇకముందు జరపబోయే సమిష్టిచర్యల్లో పాల్గొనాలని ఇష్టపడుతున్నప్పటికీ డబ్బులేనందువల్ల పాల్గొనలేక పోయే దేశాలకు అమెరికా ఆయుధాల ఖర్చును భరిస్తుంది.

నేడు సమితి సమిష్టిచర్యల కమిటీలో అమెరికన్ ప్రతినిధి వాడ్స్‌వర్త్ ఈ విషయాన్ని వెల్లడించారు. సమితిజరిపే సమిష్టిచర్యలను బలపరిచే ఉద్దేశంతో అమెరికా ప్రభుత్వం ఈ నిర్ణయం చేసిందని ఆయన వివరించారు.

అమెరికన్ ప్రతినిధివర్గ నాయకుడు లాడ్జ్ గతవారం ఒక ప్రకటనచేస్తూ కొరియాలో మిత్రరాజ్యాలు (అమెరికాకాక) 2 డివిజన్ల సైన్యాన్ని పంపించినవనీ, ఈ సైన్యంవల్ల అమెరికాకు 60 కోట్ల డాలర్ల ఖర్చు కలిసి వచ్చిందనీ తెలియజేశారు.

### కొరియా యుద్ధవిరమణ సంఘ హెచ్చరిక

పాన్‌మున్‌జాన్, ఆగస్టు 4: దక్షిణ కొరియాలో తమ బాధ్యతలను నిర్వహిస్తున్న యుద్ధవిరమణ పర్యవేక్షక సంఘసభ్యుల భద్రతకు హామీయివ్వవలసిందిగా, అందులోవున్న నాలుగు దేశాల ప్రతినిధులూ మిత్రరాజ్య ప్రధానాధికారులను కోరారు. తమలో కొందరికి ప్రమాదకరమయిన పరిస్థితులు ఏర్పడుతున్నవనీ, వాటిమీద తగిన చర్య తీసుకోవాలనీ పర్యవేక్షక సంఘం హెచ్చరించింది.

# కాకినాడ పురపాలక సంఘం

## విద్యాభివృద్ధికి కృషి

కాకినాడ, ఆగస్టు 5: కాకినాడ పురపాలక సంఘంవారు క్రిందటినెల 31వ తేదీన చైర్మన్ శ్రీ సి. వి. కె. రావుగారి అధ్యక్షతన సమావేశమయి గాంధీనగర్ మున్సిపల్ హైస్కూలు భవననిర్మాణానికి సబ్సిడీగా 85,000 రూపాయలు మంజూరు చేయవలసినదిగా ఆంధ్ర ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు. దీనికి పురపాలకులు రెండోసారి తీర్మానం చేశారు.

సీతారాంపేట గెస్ట్‌హౌస్ కాకినాడ సింగుబరులు ఒక వినమ్రబిల్డి నిర్మించడానికి కాకినాడ హైకేస్ ఇంజనీరు పంపిన ఉత్తరానికి కౌన్సిలువారు సమ్మతం తెలియజేశారు. కేంద్ర ఆర్థిక మంత్రి గతమాసంలో కాకినాడ విచ్చేసిన సందర్భంలో కౌన్సిలువారు తమ స్వాగతపత్రములో మంత్రిని ఈ విషయం అభ్యర్థించారు.

మున్సిపల్ బాలికల ఉన్నతపాఠశాల ఆటస్థలానికి, హైస్కూలు విస్తరణకు గాను 1,01,638 రూపాయలకు సి. వి. విశ్వనాథశర్మ కౌన్సిలుయందుంచగా, పురపాలకసంఘంవారి నిర్ణయంతో వివరించమని జిల్లాకలెక్టరుగారు కోరుతూ వ్రాసిన ఉత్తరాన్ని కౌన్సిలువారు ఆమోదించారు. (స్వ. వి.)

పశ్చిమరాజ్యాలు ప్రతిపాదించే ఆగ్నేయాసియా ఒప్పందంలోకి చేరిందంటే, అర్థ కాని పరిస్థితిలో పడిపోగలదని ఆయన హెచ్చరించారు.

"ప్రధాని నెహ్రూ ప్రతిపాదిస్తున్న ఆసియా ఒప్పందం (విరామ క్రమం, శోకంలో విముఖత ఒప్పందాలు) లో చేరటమే మనకు మంచిదని, దానివల్ల అమెరికా సహాయంలేకుండా పోయిందేమోకాని, మన స్వాతంత్ర్యం మాత్రం నిలుస్తుంది. ఇంతవరకూ సింహళం నాయమాత్రమయిన ఏటవస్తు విధానాన్ని అనుసరిస్తున్నది. క్రియను మాత్రం పశ్చిమ రాజ్యాల వైపుకే మొగ్గుతున్నది. బ్రిటన్‌తో ఉన్న రక్షణ ఒప్పందమే దీనికి కారణం. ఇంక తన విధానాన్ని సింహళం మార్చుకోవలసిన సమయం వచ్చింది" అని బండారనాయకే ఉద్ఘాటించారు.

ప్రధాని కొటేలవల చర్చకు సమాధానమిస్తూ రాగల ఫలితాలన్నిటినీ తెలుసుకోనిదే సింహళం ఆగ్నేయాసియా ఒప్పందంలో చేరదలచుకోలేదు. దయాదారపులో స్విట్జర్లాండువలె, ఆసియాలో సింహళాన్ని తటస్థదేశంగా చేయటం తన ఉద్దేశమని అన్నారు.

# విద్యాశాఖ డైరెక్టర్

మద్రాసు, ఆగస్టు 5: ఆంధ్ర విద్యాశాఖా డైరక్టరు డి. ఎస్. రెడ్డిగారు రేపు ఉదయం కారులో అనంతపురం నుండి 9 కి మద్రాసు వస్తారు. ఢిల్లీలో జరిగే విద్యావేత్తల సమావేశానికి 11న విమానంలో బయలుదేరి రెడ్డిగారు ఢిల్లీ వెళతారు.

## గోదావరి ఆనకట్ట పట్టర్లు

### పెద్దవి చేయాలని రైతుల విజ్ఞప్తి

కర్నూలు, ఆగస్టు 4: గోదావరి ఆనకట్టలలో మూడడుగుల పట్టర్లను తీసివేసి 6 అడుగుల పట్టర్లను పెట్టించవలసిందిగా కోరుతూ గోదావరి జిల్లా రైతుల తరఫున రెవిన్యూమంత్రికీ, ఇతర మంత్రులకూ ఒక మెమోరాండం సమర్పింపబడింది.

ఇప్పటి 3 అడుగుల పట్టర్లను తీసివేసి 6 అడుగుల పట్టర్లను పెట్టినట్లు మరింత నీరు జిల్లాలకు లభ్యమయ్యేటట్లు మరింత నీటిని నిలువ చేయటానికి సాధ్యమవుతుందని శ్రీయుతులు కె. గంగరాజు, ప్రత్తి శేషయ్య, చింతలపాటి లచ్చిరాజు, జవ్వాది లక్ష్మయ్య, కె. వెంకటరత్నం, కలిదిండి పెద సుబ్బరాజు, రామలింగరాజు, మూరిన నరసన్న ప్రభృతులతో కూడిన ప్రతినిధి వర్గం మంత్రులకు తెలియజేశారు.

## గోహత్యా నిరోధక శాసనం అవసరం

గుంటూరు, ఆగస్టు 1: పట్టణ గోరక్షణ సంఘంవారు తాము పోషించు గోవుల నలంకరించి గత నెల 27 న పురవీధుల్లో ఊరేగించారు. సాయంకాలం శ్రీ యన్. వి. యల్. నరసింహారావుగారి అధ్యక్షతన గాంధీ పార్కులో బహిరంగసభ జరిగింది.

## కుప్పుస్వామి కమిటీ నివేదికకు ప్రాథమికోపాధ్యాయుల సవరణ

### "కేంద్ర వేతనాల కమిటీ సిఫార్సులను అన్ని గ్రేడ్లవారికి వర్తింప చేయాలి"

విజయవాడ, ఆగస్టు 2: రాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ సమాఖ్య కార్యనిర్వాహకవర్గం మొన్న, నిన్న, శ్రీ పి. హెచ్. లక్ష్మయ్యగారి అధ్యక్షతన సమావేశమై దిగువ సూచించిన మార్పులతో కుప్పుస్వామి కమిటీ నివేదిక నమలుపరచాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది.

1, 2, 3, 4, సిఫార్సులలో సూచించిన కమిటీల నిర్మాణం యీ క్రింది విధంగా వుండాలి. అని ఎన్నికద్వారా జరగాలి. రాష్ట్ర విద్యాకమిటీ కూడ తప్పక వుండాలి.

తాలూకా కమిటీ; 15 మందితో నుండాలి. పంచాయతీ ప్రతినిధులు- 5 (తాలూకాలోని పంచాయతీ సభ్యుల లోనుండి ఎన్నుకోబడాలి.) ప్రాథమికోపాధ్యాయులు- 5, (తాలూకా వుపాధ్యాయులనుండి ఎన్నుకోబడాలి) స్థానిక శాసనసభ్యులు, డిప్యూటీ యిన్స్పెక్టర్లు, విద్యావేత్తలు కలిసి 5 మంది యుండాలి. ఛైర్మన్‌ను ఎన్నుకోవాలి. కార్యదర్శి; సీనియర్ డిప్యూటీ యిన్స్పెక్టర్ (ఓటింగు హక్కు లేదు); విశేష కమిటీలలో ప్రాథమికోపాధ్యాయులకు కూడా ప్రాతినిధ్యం వుండాలి.

విద్యావేత్తలు 2, ఛైర్మన్ ఎన్నుకోబడాలి. కార్యదర్శి- జిల్లా విద్యాధికారి (ఓటింగు హక్కు లేదు) రాష్ట్ర విద్యాకమిటీ; ప్రతి జిల్లాకమిటీనుండి ఒకరు చొప్పున 11; శాసనసభ్యులు 2; పార్లమెంటు సభ్యులు 2; ప్రాథమికోపాధ్యాయులు 2; జిల్లా విద్యాధికార్లు 3; విద్యావేత్తలు 2; మొత్తం 21 నుండి. ఛైయిర్మన్ ఎన్నుకోబడాలి. కార్యదర్శి- రాష్ట్ర విద్యా శాఖాధికారి (ఓటింగు హక్కు లేదు.)

30 వ సూచన "అన్ని గ్రేడుల ఉపాధ్యాయులకు కేంద్ర వేతనాల కమిటీ సిఫార్సుచేసిన వేతనాలనే యివ్వాలి" అని మార్చాలి; సర్వీసును విలువకలిగే విధంగా గత ప్రతి సం॥ సర్వీసుకు ప్రస్తుతం స్కేలులో సూచించిన ఇంక్రిమెంటులో సగంచొప్పున నిర్ణయించి వుపాధ్యాయులకివ్వాలి. ఉపాధ్యాయుల విద్యార్థుల నిష్పత్తి 1-30 లో వుండాలి.

ప్రస్తుతమున్న 5 సం॥ల ప్రాథమిక విద్యాకోర్సు చాలదు. కనీసం 8 సం॥ లుండాలి. కనుక 8 సం॥ల నిర్బంధ వుచిత ప్రాథమికవిద్యకు ప్రభుత్వం ...

## కాళహస్తిలో హరిజన హాస్టలు

### ఉపముఖ్యమంత్రిచే ప్రారంభోత్సవం

కాళహస్తి, ఆగస్టు 3: కాళహస్తిలో మొన్న హరిజన భోజనవసతిగృహము ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారిచే ప్రారంభోత్సవము చేయబడినది. శ్రీయుతులు డిప్యూటీ స్పీకరు యం. అనంతశయనం అయ్యంగారు, వి. బలరాంరెడ్డిగారు యం. పి.; జిల్లా కలెక్టరు యన్. యూగంటి, రామచంద్రారెడ్డి (జిల్లా పోలీసు సూపరింటెండెంటు), శ్రీ జయరామరావు పంచాయతీ అధ్యక్షులు, ఇతర రివిన్యూ అధికారులు, పురప్రముఖులు హాజరైనారు.

శ్రీ అనంతశయనం అయ్యంగారు మాట్లాడుతూ పూర్వము సత్రములు, నూతులు, దేవాలయములు కట్టుటవలన పుణ్యముకలుగునని, పుత్ర సంతాన ప్రాప్తి కలుగునని శాస్త్రములలో చెప్పబడియున్నది. నేడు బీదవారికి అన్నదానము, విద్యాదానము చేసినట్టి పుణ్యములబ్బును. హరిజనులు పంచములు, అంటరానివారని మనముతోసివేసితిమి. ...

## ఒంగోలు మున్సిపాలిటీ

### ద్వితీయశ్రేణికి పెంచాలని కౌన్సిల్ అభ్యర్థన

ఒంగోలు, ఆగస్టు 3: పట్టణ జనాభా బాగా పెరిగినందున పురపాలక సంఘాన్ని తృతీయశ్రేణి నుండి ద్వితీయశ్రేణి సంఘముగా మార్చాలని రాష్ట్రప్రభుత్వాన్ని కోరుటకు పట్టణ పురపాలక సంఘంవారు జూలై 30-న జరిగిన కౌన్సిల్ సమావేశంలో తీర్మానించారు. శ్రీ తాతా లక్ష్మీనృసింహాస్వామి అధ్యక్షతవహించారు.

సవరణ గావించబడిన బడ్జెటునుంచి రు. 1875/-ల ఖర్చుతో గాంధీపార్కులో మహాత్మాగాంధీ విగ్రహం నెలకొల్పాలని నిర్ణయించారు. గద్దలగుంట పాలెంవద్ద కల్వర్టు నిర్మించుటకు రు 1450/-లు మంజూరుచేశారు. అనాథ శవాలను శ్మశానవాటిక వద్దకు గొనిపోవుటకు ఒకబండిని కొనేనిమిత్తం రు. 850/-లు మంజూరు చేశారు. కౌన్సిల్ కార్యక్రమాలు వివరించే లేఖలను సభ్యులకు పంపాలని కూడా నిశ్చయించారు.

మున్సిపల్ వుద్యోగులకు మున్సిపల్ నిధులనుంచి ...

## కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాల్లో మిగిలినపని 15 నెలల్లో పూర్తి

### స్థానికాధికారులకు యితోధిక అధికారాలు కల్పించాలని కర్నూలు సమావేశంలో నిర్ణయం

కర్నూలు, ఆగస్టు 3: ప్రభుత్వ శాఖల అధిపతులూ, కార్యదర్శుల మహాసభ మొన్ననూ, నిన్ననూ రెండు రోజులపాటు ఇక్కడ ప్రధాన కార్యదర్శి వి. పుల్లారెడ్డిగారి అధ్యక్షతను సమావేశమయింది. రాష్ట్రంలోని రెండు కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాలలోనూ జరిగిన కార్యకలాపాల పురోగమనాన్ని సమీక్ష చేసిన పిమ్మట, ఈ ప్రాజెక్టు ప్రాంతాలలో జరిగిన ఆయా పనికి అందుకు సంబంధించిన శాఖల అధిపతులనే బాధ్యులను గా చేయడానికి నిశ్చయింపబడినట్లు తెలిసింది.

అవాంతరాల నివారణకున్నూ, కార్యగతిని త్వరితపరచుటకున్నూ అవశ్యకమైనవిగా భావింపబడిన ఉపాయాలను గురించి సభవారు ఆమోదించారు. స్థానికాధికారులకు ఇతోధికమైన అధికారాలు ఇచ్చుటకున్నూ, గ్రామస్థాయి కార్యకర్తలకు ఇతోధికమైన ఉత్సాహాన్ని కల్పించుటకున్నూ, కూడ సభవారు నిశ్చయించారు. ప్రాజెక్టు ప్రాంతాలలో మిగిలిపోయిన పనిని మిగిలిన పదిహేను నెలల కాలవ్యవధిలోనే ముగించాలనికూడ నిశ్చయింపబడింది.

1 వ తేదీ ఉదయం సమావేశంలో ప్రాజెక్టు కార్యకలాపాల సమాలోచన జరిగింది. పనులు త్వరగా జరిపించడానికి తగిన పద్ధతులు పరిశీలింపబడినవి. ఆ ఉదయం సమావేశంలో ప్రధాన కార్యదర్శి పుల్లారెడ్డిగారు ప్రసంగిస్తూ ప్రభుత్వ శాఖలన్నీ పరస్పరం సహకరించవలసిన అవసరాన్ని ... చెప్పినట్లు తెలుస్తున్నది.

## ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

హెడ్ ఆఫీసు: మచిలీపట్నం.

ప్రకటన

జూలై 30-వ తేదీన జరిగిన బోర్డు ఆఫ్ డైరెక్టర్ల సమావేశములో దిగువ వివరింపబడినట్లు లాభములనుండి ఇంటీరియం అప్రాప్రియేషన్సు చేయబడినవి.

| | |
|---|---|
| 30-6-1954 తో అంతమైన అర్ధ సంవత్సరమునకు (ఆడిటుకు లోబడి) నికర లాభం | రు. అ. పై. .... 8,69,028-4-8 |
| గత సంవత్సరం లెఖ్ఖ నుండి జమకట్టబడినది | రు. 7142-14-2 |
| మొత్తము. | 8,76,171-2-10 |
| ఇందులో తగ్గింపు: | |
| 30-6-1954 తో అంతమైన అర్ధ సం॥ నకు ఇంకంటాక్సు లేకుండా సం॥నకు 7% వంతున అడ్-ఇంటీరియం డివిడెంటు మొత్తము | 87,500-0-0 |
| స్టాట్యుటరీ రిజర్వుకు మార్పుదల చేసినది | 75,000-0-0 |
| తరువాత అర్ధ సం॥ నకు జమకట్టవలసిన మొత్తం | 2,18,671-2-10 |
| | 8,76,171-2-10 |

... సొర్లకు అర్ధనెల జీతము బోనస్‌గా మంజూరు చేయబడినది.

1954 ఆగస్టు 30 వ తేదీ సోమవారం నుండి 1954 సెప్టెంబరు 11 వ తేదీ శనివారం వరకు రెండురోజులు కలిసి వాటా మార్పుదల పుస్తకం మూసియుంచబడును.

ఇంటీరియం డివిడెండు 13-9-52 తేదీన ...

## ఓవరం మున్సిపల్ పరిపాలనా నివేదిక

### కౌన్సిల్ ఆమోదం

## బొబ్బిలిలో ఆంధ్రా బ్యాంకి బ్రాంచి ఆఫీసు

... పల్లి రాజావారు బ్యాంకి పురోభివృద్ధి వివరించారు. బొబ్బిలి కుమార రాజా, కిర్లంపూడి జమీందారు, వి. రాజగోపాలరావు, ఎస్టేటు మేనేజరు గార్లు తదితర ప్రముఖులు పాల్గొన్నారు.

## విద్యార్థి ఆత్మహత్య

... లో వున్న అడవిలో నిన్న ఆత్మహత్య చేసుకున్నాడు. స్కూల్ ఫైనల్ 3 సార్లు తప్పారట. బతుకుదెరువు కనిపించక జీవితంమీద రోసి ఆత్మహత్య చేసుకున్నాడని అనుకుంటున్నారు.

## బాపట్ల మునిసిపల్ కౌన్సిల్ సమావేశం

## మంచి నోట్లకు రెట్టింపు దొంగనోట్లు

### నమ్మించి మోసం చేసినందుకు ఏడాది శిక్ష

... ప్రాథమిక విద్యకు రు 486684/-లు ...

... లనీ కూడా తీర్మానించింది. (స్వ. వి)

# రాష్ట్ర వార్తలు

### పామర్రు

ఆగస్టు 1 న రచయితల సంఘం స్థాపించబడెను. శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు-అధ్యక్షులు, శ్రీ లంకా నరసింహం-కార్యదర్శి, టి. వి. వి. ప్రసన్నారావుగారు-సహాయ కార్యదర్శి, కోసూరు వెంకటాచలంగారు-కోశాధికారి, గంధం ఆశీర్వాదం వానపాముల ధీమరాచార్యులు, ఉర్లపాటి తిరుమలరావుగార్లు.

### కొవ్వూరు

జూలై 29 వ తేదీన పశ్చిమగోదావరిజిల్లా డిప్యూటీ ప్రొహిబిషన్ సబ్ ఇన్‌స్పెక్టరు ఎమ్. రాజారావుగారు సబ్ ఇన్‌స్పెక్టరు సత్యనారాయణగారి సహాయంతో కొవ్వూరు తాలూకా యీదపోలు గ్రామమునిమీద దాడిచేసి అక్రమంగా సారా తయారుచేస్తున్న ఆరుగురిని అరెస్టు చేశారు. ఆ తరువాత వారందరినీ జామీనుమీద విడిచిపెట్టారు.

### రాజమండ్రి

రాజమండ్రి గోటర్లిస్బువారు ఈ నెల 2 వ తేదీ సాయంకాలం సమావేశమై, సంఘ ఉపాధ్యక్షులు శ్రీ దవతి రామమోహనరావుగారిని అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. కార్యదర్శిగావున్న శ్రీ దంతాల రామయ్య నాయుడుగారిని ఉపాధ్యక్షునిగాను- శ్రీ వాసుదేవు బాసిరాజుగారిని కార్యదర్శిగానూ ఎన్నుకున్నారు. అధ్యక్షులుగావున్న శ్రీ వేదాంతం సత్యనారాయణ నెల్లూరు సబ్ జడ్జీగా బదిలీ కాబడినందున యీ ఎన్నికలు ...

### మంగళగిరి

### తొర్రేడు

### కాకినాడ

గోదావరి డివిజన్ సాంఘిక విద్యాజన విద్యాశాఖాధికారి జె. వి. కామేశ్వరరావ్‌గారు గుంటూరుకు బదిలీ అయారు

తూర్పుగోదావరిజిల్లా బోర్డుస్పెషల్ ఆఫీసరుకు పర్సనల్ అసిస్టెంట్‌గా జె. రామారావుగారు పి. రమణయ్యగారివద్ద నుంచి ఈనెల 2 వ తేదీన ఛార్జీని తీసుకొన్నారు. రమణయ్యగారు జిల్లా బోర్డు స్పెషల్ ఆఫీసరుకు పర్సనల్ అసిస్టెంటుగా బదిలీఅయారు.

### విజయవాడ

విజయవాడ పట్టాభి గ్రంథాలయ సర్వసభ్య సమావేశం చింతపల్లి కృష్ణమూర్తిగారి అధ్యక్షతన ఈనెల మొదటి తేదీన జరిగింది. గ్రంథాలయ పురోభివృద్ధికి కృషి చేయ్యడానికి గాను శ్రీయుతులు ఎ. వైరాగి, పి. మాధవరావ్, కె. సూర్యనారాయణ, ఎ. లక్ష్మణరావ్, ఎ. నరసింహారావు గారలు సభ్యులుగా ఒక సంఘాన్ని ఎన్నుకున్నారు. పేట అభివృద్ధిసంబంధించి అధికారులతో సంప్రదింపులు జరపడానికిగాను శ్రీ ఎస్. కనకారావ్, వై. అప్పారావ్, కె. అప్పారావ్, జి. పాపయ్య, ఎస్. శ్రీరాములు గారలు సభ్యులుగా ఒక సంఘాన్ని ...

### రాయదుర్గం

### రాజమండ్రి

రాజమండ్రి పట్టణ వాణిజ్య మండలి అధ్యక్షులు శ్రీ దవతి రామమోహనరావు గారి యింట శ్రీ అప్పన సుబ్రహ్మణ్యంగారు ఆంధ్ర వాణిజ్య మండలి అధ్యక్షులు శ్రీ జె. వి. సోమయాజులు గారికి ఈ నెల 1వ తేదీ ఉపాహార విందు చేశారు. రాజమండ్రి వాణిజ్య మండలి పాలకవర్గ సభ్యులు సుమారు 30 మంది, శ్రీ ఉప్పుటూరి పున్నారావు (గుంటూరు) మొదలయిన వారు విందులో పాల్గొన్నారు. ...

### గోనెగండ్ల

### నక్కపల్లి

నక్కపల్లి మహిళాభ్యుదయ సంఘ సమావేశం జూలై 30 తేదీన జరిగింది. శ్రీమతి గాదేపల్లి శేతామహాలక్ష్మమ్మ గారిని అధ్యక్షురాలుగానూ, శ్రీమతి మ. సీతాయమ్మగారిని కార్యదర్శిగానూ ఎన్నుకున్నారు. జాతీయ వికాస కార్యక్రమానుసారం స్త్రీ జనాభ్యుదయ కేంద్రం నడపాలని తీర్మానించారు.

### భీమవరం

భీమవరంతాలూకా ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలల మేనేజర్ల సమావేశం జూలై 31 వ తేదీన భీమవరం చర్చీ ఎలిమెంటరీస్కూలులో వై. విశ్వనాథంగారి అధ్యక్షతన జరిగింది. ...

### నెల్లూరు

### నిడదవోలు

## అంధ్ర బ్యాంకు ... ఎలక్షన్ నోటీసు

## కుష్ఠు * బొల్లి

# క్రీడారంగం

## నేషనల్ ఫుట్‌బాల్

### మధ్యప్రదేశ్ పై బెంగాల్ గెలుపు

మద్రాస్, ఆగస్టు 5: ఇక్కడ జరుగుతున్న సంతోష్ ట్రోఫీ నేషనల్ ఫుట్‌బాల్ చాంపియన్‌షిప్ పోటీలలో నిన్న బెంగాల్ మధ్యప్రదేశ్ ను 2 గోలుల తేడాతో ఓడించి (4-2) క్వార్టర్ ఫైనల్స్‌లో ప్రవేశించింది. గత సంవత్సరం చాంపియన్ అయిన బెంగాల్ గెలవటం ఆశ్చర్యకరం కాలేదు గాని, మధ్యప్రదేశ్ మంచి పోటీ ఇచ్చి ప్రశంసలు పొందుతున్నది.

ఈ వేళ కూడా వానవల్ల నేలంతా బురదగానే ఉన్నది.

బెంగాల్ జట్టు బంతిని పైకి లిఫ్ట్ చేస్తూ, సాధ్యమయినంతవరకూ నేల బారుగా నేనడిపించింది. మొదటి ఆట ఆడినంతా, మంచి తెలివిగా, సున్నితంగా ఆడి గోలు సాధించింది. మధ్యప్రదేశ్ దురదృష్టవశాత్తు గోలు చేసే అవకాశాలు కొన్ని జారవిడుచుకున్నది. లేకపోతే ఇంత తేడా ఉండేది కాదు.

బెంగాల్ తరఫున మొదటి గోలును లెఫ్ట్ ఇన్ అహమద్ ఖాన్ చేశాడు. తరవాత సెంటర్ ఫార్వర్డ్ రామేశ్వర్ రెండు గోలులు, రైట్ అవుట్ కనయాన్ ఒక గోలునీ చేశారు. మధ్యప్రదేశ్ తరఫున సెంటర్ హాఫ్ బాలయ్య, సెంటర్ ఫార్వర్డ్ జోన్స్ బాగా ఆడారు. జోన్స్ రెండు గోలులు చేశాడు.

క్వార్టర్ ఫైనల్స్‌లో బెంగాల్ ఒరిస్సాతో పోటీ చేస్తుంది.

రేపు సాయంత్రం క్వార్టర్ ఫైనల్స్‌లో హైదరాబాదు, సర్వీసెస్ జట్లు పోటీ చేస్తాయి.

బెంగాల్—ఎం. సర్కార్ (గోలర్), ఎన్. ముఖ్నా (లెఫ్ట్‌బాక్, కాప్టెన్), టి. రాయ్ (రైట్ బాక్), పి. మిత్తర్ (లెఫ్ట్ హాఫ్), చందన్ సింగ్ (సెంటర్ హాఫ్), గోకుల్ (రైట్ హాఫ్), ఎస్. రాయ్ (లెఫ్ట్ అవుట్), అహమద్ ఖాన్ (లెఫ్ట్ ఇన్), రామేశ్వర్ (సెంటర్ ఫార్వర్డ్), ఎ. బోస్ (రైట్ ఇన్), కనయన్ (రైట్ అవుట్).

మధ్యప్రదేశ్—నజీర్ (గోలర్), లాజరస్, అగర్వాల్, (కాప్టెన్), నరసయ్య, బాలయ్య, మహమ్మద్ అలీ, ఇజహార్, సలాఉద్దీన్, జోన్స్, ఇబ్రహీం, బాలకృష్ణన్.

### ఆంధ్ర సరిహద్దుల సమాచార ఉద్యోగి

విజయవాడ, ఆగస్టు 4: సరిహద్దుల విషయంలో సమాచారం సేకరించుటకు గాను నియమింపబడిన ప్రత్యేకోద్యోగి శ్రీ బసవరాజుగారు ఈ ఉదయం ఇక్కడికి వచ్చి విశాలాంధ్ర మహాసభ అధ్యక్షులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు గారితో సమాలోచనలు జరిపారు.

రాజమండ్రి గౌతమీ వాణిజ్యమండలివారి ప్రథమ వార్షికోత్సవం జూలై 31 వ తేదీన ఆంధ్రవాణిజ్య మండలి అధ్యక్షుడు జె. వి. సోమయాజులుగారి అధ్యక్షతన జరిగింది

# మద్రాసు అసెంబ్లీకి గుడియాత్తం ఉపఎన్నికలో శ్రీ నాడార్ ఘనవిజయం

## కాంగ్రెస్ హరిజన్ అభ్యర్థి గెలుపు

గుడియాత్తం, ఆగస్టు 5: కాంగ్రెసు పక్షాన మద్రాసు శాసనసభకు గుడియాత్తం నియోజకవర్గం నుంచి పోటీ చేసిన కాంగ్రెసు అభ్యర్థులు మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కె. కామరాజనాడారు, టి. మనవాళన్ (హరిజన్) గారలు అత్యధిక ఓట్లతో ఎన్నికైనట్లు రిటర్నింగ్ ఆఫీసరు శ్రీ పి. సి. మాణిక్యం గారు నిన్న సాయంత్రం ప్రకటించారు.

కమ్యూనిస్టు అభ్యర్థిపై నాడారుగారికి 38,212 ఓట్లు మెజార్టీ లభించినది. ఓట్లు ఈ విధముగా వచ్చినవి.

| | |
|---|---|
| శ్రీ కామరాజనాడారు (కాం-సామాన్య నియోజకవర్గం- | 64,344 |
| శ్రీ టి. మనవాళన్ (కాం.(హ) | 53,604 |
| శ్రీ కోదండరామన్ (కమ్యూనిస్టు-సా) | 26,132 |
| శ్రీ కృష్ణస్వామి (స్వ-(హ) | 22,540 |
| శ్రీ ఆదిమూలం (స్వ-(హ) | 5,341 |
| చెల్లని ఓటు | 6,667 |
| మొత్తం పోలైనఓట్లు | 1,78,567 |

పెద్ద వర్షం కురుస్తున్నా జనం ఫలితం కోసం వేచి ఉన్నారు. శ్రీ కామరాజనాడారు, మనవాళన్ గారలు ఎన్నికైనారని ఫలితం ప్రకటించ బడటంతోటే 'కాంగ్రెసుకు జై' 'నాడారుకు జై' అనే జయజయ ధ్వానాలతో దిక్కులు పిక్కటిల్లినవి. టపాకాయలు బాణా సంచా కాల్చబడినవి. నాడారుగారి ప్రతినిధులుగా ఓట్ల సమయంలో ఉన్న కేంద్ర పార్లమెంటరీ కార్యదర్శి జి. రాజగోపాలన్ గారికి, పి. రామచంద్రన్ గారికీ, ప్రత్యేక నియోజకవర్గ అభ్యర్థి మనవాళన్ గారికి పూలమాలలు పుష్కలంగా సమర్పింపబడినవి. వారిని ఊరేగింపులో కాంగ్రెసు కార్యాలయానికి తీసుకువెళ్ళారు.

ఎన్నిక ఫలితానంతరం కె. కామరాజనాడారుగారిని ఆంధ్రపత్రిక ప్రతినిధి చూడగా ప్రజాస్వామ్యం కాంగ్రెసుకే అంకితమైనదనడానికి మరియొక్క తార్కాణమనీ తనను గెలిపించిన వారందరికీ హృదయపూర్వక కృతజ్ఞతావందనము అర్పిస్తున్నామనీ నాడారుగారు చెప్పారు. నాడారుగారు యీ మధ్యాహ్నం బహిరంగ సభలో పాల్గొనడానికి గుడియాత్తం వెళ్ళారు. వారు వెళ్ళేవరకు కూడా అనేక మంది మిత్రులు వచ్చి వారినభినందిస్తూ అనేక పుష్పమాలలు సమర్పించారు. నాడారుగారు యీ రాత్రికి మద్రాసు తిరిగి వస్తారు.

# ఈజిప్టుకు అమెరికా ధనం, ఆయుధాలు

## కైరోలో సమాలోచనలు

కైరో, ఆగస్టు 4: అమెరికా ఇచ్చే ఆర్థిక సైనిక సహాయాన్ని గూర్చి నిన్న ఇచ్చట ఈజిప్టు విదేశాంగమంత్రి డా॥ ఫాజీ, అమెరికా రాయబారి జెఫర్‌సన్ కాఫేలకు మధ్య సమాలోచనలు ప్రారంభం అయినాయి.

తాను గనుక ఆయుధాలు ఇస్తే వాటిని దురాక్రమణ కార్యాల నిమిత్తం ఉపయోగించరాదని హామీ ఇయ్యవలసిందిగా అమెరికా ఈజిప్టును కోరింది.

ఈజిప్టు ఆ హామీ ఇచ్చింది. ఆ అనంతరమే ఈ సమాలోచనలు ప్రారంభమైనాయి.

# ఉద్యోగవార్తలు

కర్నూలు, ఆగస్టు 4: డిప్యూటీ కలెక్టరు ఎమ్. సన్యాసి రావుగారు సెలవునుంచి రాగానే అనంతపురం ట్రెజరీ డిప్యూటీ కలెక్టర్ గా పని చేస్తారు. రామమోహన రావుగారు సెలవులో వెడుతున్నారు.

ఆర్థిక శాఖ అఫిషియేటింగ్ అసిస్టెంటు సెక్రెటరీ వి. నాగరాజారావు గారు సెలవునుంచి రాగానే, అదే శాఖలో తాత్కాలికంగా అడిషనల్ డిప్యూటీ సెక్రెటరీగా నియమించబడ్డారు.

ఎలెక్ట్రిసిటీ శాఖ జూనియర్ ఇంజినీర్ ఆర్. జగదీశ్వరరావుగారు పదవిలో ప్రవేశించిన తేదీ లగాయతు బాయిలర్సు ఇనస్పెక్టర్ గా నియామింపబడ్డారు.

# విజయవాడకు వెనుకబడిన జాతుల కమిషన్ ఆగమనం

## ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షుని అభిప్రాయ సేకరణ

విజయవాడ, ఆగస్టు 5: ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వ హరిజన అభివృద్ధి శాఖ డైరెక్టరు శ్రీ టి. ప్రభాకరరావ్ గారు వెంటరాగా వెనుకబడిన జాతుల కమిషన్ అధ్యక్షుడు శ్రీ కాకా సాహెబ్ కలేల్కర్ సభ్యులు శ్రీ రాజేశ్వర పటేల్ శివాభాయి, క్షిరోల్కర్ గారలు ఈ వేళ ఉదయం కర్నూలు నుంచి ఇక్కడికి వచ్చారు. ఆంధ్రరాష్ట్ర వెనుకబడిన జాతుల సంఘం అధ్యక్షుడు శ్రీ తులాబందుల నాగేశ్వరరావ్, వెనుకబడిన జాతుల సంఘం ప్రత్యేక మహాసభ తాలూకు ఆహ్వానసంఘం అధ్యక్షుడు శ్రీ ఎమ్. రామబ్రహ్మారావ్ ప్రభృతులు స్టేషనువద్ద శ్రీ కలేల్కర్ ప్రభృతులకు స్వాగతమిచ్చారు.

శ్రీ కలేల్కర్ ప్రభృతులు ఇక్కడికి రాగానే కృష్ణా బారేజి నిర్మాణ పనినీ, అక్కడ జరుగావాలా మొదలయిన వాటినీ చూశారు.

ఈ వేళ ఉదయం ఈ పట్టణంలోని లక్ష్మీటాకీస్ హాలులో ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారి సాక్ష్యాన్ని వెనుకబడిన జాతుల కమిషన్‌వారు రికార్డు చేయటం ప్రారంభించారు.

అంతకుముందు ఈ కమిషన్ వారు వెనుకబడిన జాతులవారు తయారుచేసిన వస్తు ప్రదర్శనాన్ని చూశారు. అటు తరువాత వివిధ వెనుకబడిన జాతుల విజ్ఞప్తులను స్వీకరించి తమను కలుసుకొన గోరినవారికి అవకాశం ఇచ్చారు.

ఈ వేళ మధ్యాహ్నం వీరిరాక సందర్భంలో ఏర్పాటు చేయబడిన వెనుకబడిన జాతుల సంఘ ప్రత్యేక మహాసభలో ఉపన్యసిస్తారు.

### కమిషన్‌కు పెక్కు సంఘాల అభ్యర్థన

కర్నూలు, ఆగస్టు 4: వెనుకబడిన తరగతుల కమిషన్ వారికి వివిధ సంఘాల తరఫున తమని వెనుకబడిన కులాల జాబితాలో చేర్చమని విజ్ఞప్తులు సమర్పించటం జరిగింది.

వాల్మీకి, ఉప్పర, బలిజ, కంసాలి తదితరులు తమ విజ్ఞప్తులలో విద్యావిషయంలో, సాంఘికంగా, ఆర్థికంగా వెనుకబడి ఉన్నామనీ, ప్రభుత్వ సహాయం లేనిదే తదితర కులాల స్థాయికి రాకటం సంభవం కాదనీ వివరించారు.

### నిర్మాణ కార్యకర్తల సమావేశం

బొంబాయి, ఆగస్టు 4: అఖిలభారత నిర్మాణ కార్యకర్తల, రాష్ట్రీయ ఖాదీ గ్రామపరిశ్రమ సంఘ ప్రతినిధుల సమావేశం వచ్చేనవంబర్లో పూనాలో జరుగుతుంది. రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ సమావేశాన్ని ప్రారంభిస్తారు.

## తెలంగాణా సుహృద్భావ ప్రతినిధివర్గం

### విజయవాడలో స్వాగత సన్నాహాలు

విజయవాడ, ఆగస్టు 4. విశాలాంధ్ర నిర్మాణం కావాలని కోరుతున్న తెలంగాణా ప్రముఖుల సుహృద్భావసంఘం ఈ నెల 7 నుండి 10 వ తేదీ వరకు ఆంధ్రరాష్ట్రంలో—కర్నూలు, గుంటూరు, విజయవాడలలో — పర్యటన జరిపి ప్రముఖులతో సమాలోచనలు జరుపుతారు.

ఈ సంఘంలో హైదరాబాదునగర కార్పొరేషను మేయరు శ్రీ నరసింహ సంఘీ, మీర్ అహమ్మద్ అలీఖాన్ (డిప్యూటీ మేయరు) సికింద్రాబాదు నగర కార్పొరేషను మేయరు శ్రీ యస్. బి. వెంకటేశన్, మాజీ మంత్రి శ్రీ వల్లూరి బసవరాజు, శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మి, శ్రీ కురుమూర్తి (పార్లమెంటు సభ్యుడు), శ్రీ గౌతమ్, శ్రీ కొండపల్లి (శాసన సభ్యులు) శ్రీ కొత్తూరు సీతయ్యగుప్త (హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెసు కోశాధికారి), శ్రీ వాసుదేవనాయక్ (నగర కాంగ్రెసు సంఘ అధ్యక్షులు, హైదరాబాదు) శ్రీ బొజ్జం నరసింహం (హైదరాబాదు వెనుకబడిన జాతుల సంఘ అధ్యక్షులు) శ్రీ బి. వి. సుబ్బరాయుడు, డాక్టరు రంగాచారి తదితరులు వున్నారు.

ఈ సందర్భంలో కీరు విజయవాడలో మకాం చేస్తున్న 10 వ తేదీన వీరికి స్వాగత మివ్వడానికి ఈ సాయంత్రం శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు గారి అధ్యక్షతన జరిగిన సభలో శ్రీ మాజేటి రామమోహనరావు గారు అధ్యక్షులుగ ఒక ఆహ్వానసంఘం ఏర్పాటు చేయబడింది. (స్వ. వి.)

### చిత్తూరుజిల్లా బస్సు యజమానుల సంఘం

చిత్తూరు, ఆగస్టు 4. చిత్తూరుజిల్లా బస్సుయజమానుల సంఘ తృతీయ వార్షిక సమావేశం కాంగ్రెసు కార్యాలయ భవనంలో శ్రీ అనంతశయనం అయ్యంగారి అధ్యక్షతన ఎన్నిక జరిగింది. ఈ సంఘానికి అధ్యక్షుడు శ్రీ పి. పి. ముదలి గారు, కార్యదర్శిగా పి. వెంకటకృష్ణమ నాయుడుగారూ, శ్రీ గోవిందస్వామి నాయుడుగారు మొదలయినవారు వలువురు కార్యవర్గ సభ్యులుగానూ ఎన్నికయారు. బస్సులు, లారీల మీద ఒకేపన్ను విధించవలసిందిగా ఆంధ్ర మద్రాసు ప్రభుత్వాలను అభ్యర్థించుతూ తీర్మానాలు చేశారు.

## రేడియో

శనివారం, ఆగస్టు 7

విజయవాడ

ఉ॥ 6-55 స్వాగతం 7 తెలుగున వా. 7-15 మద్రాసు (బి) వలె 8 ఆంగ్లమున వా.

మ॥ 1 (బి) వలె 1-30 (ఎ) వలె 1-40 హిందీలో వా. 1-50 తెలుగులో వా.

సా॥ 4 వనితావాణి 5.30 ఎం. గోపాలాచారి 6 ఉభయకుశలోపరి 6-10 వి. రామ సంగీతం (రి) 6-15 ప్రాంతీయ వా. 6.25 స్థానిక ప్రకటనలు 6 30 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగున వా. 7-15 మదపుటేనుగు (రూపకం) 7-30 కల్పలత (రి) 8 ఎం. గోపాలాచారి 8-30 (బి) ప్రభావతి 9 ఆంగ్లమున వా. 9-15 రాగప్రస్తారము (వేణువు) 9.30 అఖిలభారత సంగీత కార్యక్రమం-జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యం (ఢిల్లీ రిలే) 11 ప్రసార సమాప్తి.

మద్రాస్ (ఎ)

ఉ॥ 6-55 స్వాగతం 7 వాద్యసమ్మేళనం 7-15 తమిళమున వా. 7-30 ఎస్. వీరరాఘవన్ 8 ఆంగ్లమున వా.

మ॥ 1 మహిళా మండలి 1-30 (రి) 1-40 హిందీలో వా. 1-50 (రి) 2 తమిళమున వా. 2-10 (బి) వలె 2-15 రాజ లక్ష్మీనరసింహన్ 2.45 (రి).

సా॥ 4 (బి) వలె 5-30 ఆర్. ఎల్. కృష్ణమాచారి (వ) 6 ఆంగ్ల వా. 6-15 ప్రాంతీయ వా. (త) 6 25 ఎస్. రాజం-తిరుక్కురల్ 7-15 తమిళ వా. 7-30 ప్రసంగం (రి) 7 45 జంత్ర సమ్మేళనం 8 (రి) 8-15 సేలం చెల్లంఅయ్యంగార్ 9 ఆంగ్ల వా. 9-15 ఎస్. పి. నటరాజన్-వేణువు 10 పాశ్చాత్య సంగీతం (రి) 10-30 ప్రసారసమాప్తి.

మద్రాస్ (బి)

ఉ॥ 7 తెలుగు వా. 7-15 (రి) 7-30 బాలానందం 8 ఎ వలె.

మ॥ 2 గీతమాలిక 1.30 ఆంగ్ల వా. 1 40 (రి) 1-50 తెలుగు వా. 2 వీణ 2-15 పిల్లలకు (త).

సా॥ 4 పిల్లలకు (అం) 4-30 పాశ్చాత్యసంగీతం (రి).

5-30 ఎ వలె 6-15 ప్రాంతీయ వా. 6-25 లలితగీతము-వి. వెంకటేశ్వర్లు, బృందం (కలరూ, విజయా కనకో-రచన: పత్య) 6 30 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగు వా. 7-15 మదపుటేనుగు (రూపకం) 7-30 హాస్య కావ్యములు: గణపతి (చిలకమర్తి) ప్రసంగం-ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ 7.45 ఎ వలె 8 నాటిక (రి) 9 ఎ వలె 9-15 మద్రాసు రాష్ట్రాభివృద్ధి ప్రణాళికలు (ఆంగ్ల ప్రసంగం) 9-30 జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యం (ఢిల్లీ నుంచి రిలే) 11 ప్రసారసమాప్తి.

హైదరాబాద్

ఉ॥ 6-55 సుప్రభాత్, 7 తెలుగున వా॥ 7-15 ఎం. జి. ఎ. నారాయణను వేణువు, 7-45 భజన్ 8 ఆంగ్లమున వా॥ 8 15 హిందీలో వా॥ 8 30 విఠల్ రావు-గీత్, 8 45 బన్సారీలాల్—భజన్.

మ॥ 12-30 (రి), 12-50 మరాఠీలో వా॥ 1 ఎం. పీత, 1-30 (రి), 1-50 తెలుగున వా॥.

సా॥ 5-30 గీతావళి, 5-45 అధ్యాత్మ రామాయణ కీర్తనలు, 6 కన్నడమున వా॥ 6-30 (రి), 6-40 స్థానిక ప్రకటనలు, 6-45 గీతావళి, 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ—నైతిక్యమహోప్రభు (ప్రసంగం), 7-45 కన్నడమున వా॥ 8 అస్పృశ్యత (ఆంగ్లప్రసంగం), 8-15 గీత్, 8-30 భజన్, 8-45 గీత్, 9 ఆంగ్లమున వా॥ 9-15 ఉర్దూలో వా॥ 9-30 అ॥ భా॥ సంగీత కార్యక్రమం - జి. ఎన్. బి. (ఢిల్లీ రిలే), 11 ప్రసారసమాప్తి.

## ఒరిస్సా హైకోర్టు

కటక్, ఆగస్టు 4: ఒరిస్సా హైకోర్టు న్యాయమూర్తులుగ శ్రీ పి. వి. బాలకృష్ణరావు, పీతాంబర మిశ్రగారు నియమింపబడవచ్చునని తెలుస్తున్నది. న్యాయమూర్తుల సంఖ్య 4 నుంచి 5 కి పెంచాలని నిర్ణయమైనందున యీ సూచన వినవచ్చినది. గతమూర్చిలో న్యాయమూర్తి జగన్నాథ మహంతి మృతివలన 2 వ ఖాళీ ఏర్పడినది.

## మదరాసు ధరలు

మదరాసు, ఆగస్టు 5:

బంగారు-వెండి పేటె మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-8 ఎడ్వర్డుబోమ్మ సేల్సుటాక్సుతో సహా

| | |
|---|---|
| సవరను | రు. 58 2 0 |
| పెట్టాబంగారం తులం | రు. 87 10.0 |
| మూస బంగారు | రు. 86.6-0 |
| సీమవెండి తులం100కి రెడీ | రు. 155-8 0 |
| చిల్లర ధర | రు. 1-10-0 |

వేరుశనగ

(531 పా॥ 1-8 ఎక్సుకోస్టా గిడ్డంగులు మిషన్-సేల్సుటాక్సుతో సహా)

| | |
|---|---|
| | రు. 124-125-0-0 |
| వేరుశనగనూనె ఎక్సు పెల్లర్ విలో 3% (500పా.) రెడీ చిల్లరధర | రు. 242-244 |

ఔంకాయనూనె (37½ పావులు)

| | |
|---|---|
| అంబుమార్కు | రు. 29-8-9 |
| ఎం. ఎస్. ప్రాండ్ డబ్బా | 29-8-9 |
| రాజా ప్రాండ్ | రు. 28-12-9 |

ఆముదం

| | |
|---|---|
| తిరుపద్పూరు (500 పా) | రు. 200-0-0 |

పందదార

| | | |
|---|---|---|
| స్కారీ | (2 అందరు) | 34-0-9 |
| జపాన్ | (66 పా) | 25-0-9 |
| జర్మనీ | (228 పా) | 31-0-9 |

## బొంబాయిమార్కెట్

బొంబాయి, ఆగస్టు 5: ఇవాళ బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 తు.) | 153-12-0 |
| బంగారం (1 తు.) | 87-2-0 |
| సావరిన్ | 57-8-0 |

కలకత్తా మార్కెట్ ధరలు: 152-5-0 86-8-0; 57-0-0.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St. Madras.